రామానుజాచార్య విద్యాసమితి నెం 8 రు

# ముస్తఫాకెమెల్‌పాషా,

[ప్రథమ భాగము]



కిడాంబి - రంగాచార్యుఁడు




ప్రకాశకులు:
రామానుజాచార్య విద్యాసమితి,
విజయనగరము.



# ముస్తఫా కెమెలు

(దూసర వృంకము)



౧

ఈ నవయుగములో నూతనరాష్ట్రములను స్థాపించుటకెంతకాలమున కాయా దేశములలోని యార్థిక సాంఘిక నైతిక సంస్థాపనములను నిర్మూలముగా నాశము కావించిన మహాశక్తియుక్తులు లెనిను, ముస్సోలిని, ముస్తాఫా కెమెలు అని చెప్పక తప్పదు. ఏకచ్ఛత్రాధిపత్యముతో నిరంకుశ ప్రభుత్వముల రష్యాచక్రవర్తిని సకుటుంబముగను, నాతని పరిపాలన విధానమును నిర్మూలముగను, జిరకాలమునుండియుఁ బరంపరగవచ్చుచున్న సాంఘికార్థికాచార ధర్మసంస్థాపనములను నిరవశేషముగను బెకలించి దుర్భిక్షమహామారి దారిద్ర్యాదిదేవతలు తాండవమాడుచున్న రష్యాదేశమును, బాడిపంటలతోను, జీవన సౌకర్యప్రదమగు వస్తుజాలమునుఁ గోటానకోటులగు ప్రజల యుపయోగానుభవముల కనువగునట్లు నిర్మించు మహా కర్మాగారములతోను నింపి సిరుల కొటపట్టుకావించిన మహాశక్తిసమన్వితుఁడనఁదగు నాతఁడు లెనిను మహాశయుఁడె.

# ముస్తఫా కెమేలు జీవితచరిత్ర

దేశమునందరాజకము ప్రబలియుండఁ, బరిపాలకులు దారి తెన్నుఁగానక యేమిచేయుటకుందోఁపక విహ్వలులై వెల వెలబోవుచుండఁ, దానుమహాసంగ్రామములో జయముఁగాంచి నను బరాజితులు పెట్టుచు బాములకులోనై, చుక్కాని తెఱచాపమున్నగు పరికరములు లేనియోడ యల్లకల్లోలమైన మహాసముద్రమునందుఁ గొట్టుకొనిపోవునట్లు తారుమారై మహాసంక్షోభమును జెందియున్న యిటలీదేశమును సరాజకముగ నొనర్చి దుర్భిక్షాదిదుఃఖములఁ బోఁగొట్టి, ప్రజలను సోత్సాహులఁగావించి దేశకల్యాణమునకు సమకూర్చిన ప్రభుబలోపేతుఁడు ముస్సొలినియని చెప్పకతప్పదు.

మహాసంగ్రామమున జయింపఁబడి దేశము శత్రుబలాధీనమైయుండ, యుద్ధపరికరములుగాని భోజనపదార్థములుగాని లేక సైనికులును బ్రజలును గ్రుంగి కృశించియుండ, దుర్బలులు, దుర్గుణభూయిష్ఠులు, స్వలాభాపేక్షాదగ్ధమనస్కులు, దుర్నీతిపరులునగు పరిపాలకులకుతంత్రములను బన్నుచుఁ బ్రజోపకారమునకై పాటుపడువారల నష్టకష్టములఁ బెట్టుచు దేశకల్యాణమునకు విరుద్ధములగు కార్యముల నాచరించుచున్నను, దేశములోని క్రైస్తవులు స్వమతావలంబకుల ప్రోత్సాహమువే రాజాధికారమును ధిక్కరించి తదధికారులసమక్షమున మహమ్మదీయులఁ జెండాడి చిత్రవధఁగావించుచు, స్త్రీలను జెరఁబట్టుచు, గృహములను బరశురామప్రీతికావించుచు, నిరంకుశులైవిజృంభించుచున్నను, సుల్తాను వానిమంత్రులు, నాతని సేనానాయ

కులు, నేమి సేయుటకుందోఁచక విజేతలకు వందనములర్పించుచు దుర్బలులు పిరికిపందలునై వారిచేతలకుఁ దలయొగ్గుచున్నను, నాలుశతాబ్దములనుండి టర్కుల యనుభవములోనున్న రాష్ట్రములు విచ్ఛిన్నీకృతములగనొనర్చి యందులో నధికభాగమును వారినుండి జేతలు బలాత్కారముగఁదీసికొన్ననుఁ, చిరకాలమునుండి "యూరపుఖండపు జబ్బుమనిషి" అనునామమునుబడసిన టర్కుల సామ్రాజ్యముఁ దరి చుదుర్దశనొంద సంసిద్ధమైయున్ననుఁ, టర్కుల శక్తిసామర్థ్యములను, వారి వ్యాపారవిధానమును గుర్తించి వానినిమాలుపక మనమునన్నికొని ధైర్యమూని టర్కీరాష్ట్ర పునరుద్ధరణముఁగావించిన యోధాగ్రేసరుఁడు ముస్తఫాకెమలు పాషాయని గుర్తెఱుంగవలయును.

పదమూఁడు పదునాల్గవ శతాబ్దములలో ననావృష్టి బాధచే దేశము దగ్ధదేశమువలెనుండి పశువులకును మనుష్యులకును దాహాహారకములైననులేక చీనాదేశము గోడనుండి యూశియాఖండ మధ్యభాగమువఱకుఁ బగిలి యెడారియగుటచే సులేమానుషా యనునధిపతిపాలనమునఁ దమపశువులకు గ్రాసమునకై గోబీమరుభూమి ప్రాంతమునందుండు సుంగేరియా శిశాలతలమునుండి తమ యశ్వరోమ నిర్మితకాఁపటగృహముల నెత్తివేసి పశ్చిమునకై ప్రునకు టర్కులుపోసాగిరి. ఆ సులేమానుషా టాట్టాకులచే బాధింపఁబడి యార్మీనియా దేశములోనుండి దక్షిణమునసున్న యాసియా మైనరులోఁబ్రవేశించెను. సులేమాను కాలగతిఁజెందినపిమ్మట నాతసపుత్రుఁడగు నెర్తొఘ్రులు పాల

సమునకువచ్చెను. వానితరువాత నెమిరోర్ఖన్ ననునాతఁడును
నాపిమ్మట సుల్తానోర్ఖ ననునాతఁడును బాలించిరి. ఈతీరుగ
నాతని పుత్త్రపౌత్త్రప్రపౌత్త్రాదులు పది పురుషాంతరముల
వఱకు వారిని బాలించిరి. బిజాంటైనుసామ్రాజ్యము బాగ్దాదా
రబ్బీసామ్రాజ్యమును బండుటాకులవలెఁ బడిపోవుటకు సిద్ధముగా
నున్న సమయములో వాని నాటుకొలఁ జయించిరి. సులీ
మానుషా మరణించిన మూఁడువందల సంవత్సరములలో నాతని
పదియవపురుషాంతరమునకుఁ జెందినవాఁడును "మహాతేజశ్శాలి
యను'పౌరుషనామము వహించినసులీమానుచక్రవర్తి యాడ్రియా
టికు సముద్రతీరముననున్న యాల్బేనియా మొదలు కౌకసస్
పర్వత శ్రేణివఱకును వ్యాపించియున్న సామ్రాజ్యమునుఁ బరి
పాలించెను. హంగరిదేశపు రాజును గ్రిమియాదేశపు రాజును
దనక్రింద సామంతప్రభువులై కొలుచుచుండఁ, దానాఫ్రికా
ఖండపు టుత్తరభాగమునకు రారాజుగఁ బరిగణింపఁబడుచుండ,
మధ్యధరాసముద్రము తనపోతముల పర్యటనమునకుఁ గేళీ
జలాశయముకాఁగా సుల్తాను సులీమాను క్రీ॥ శ॥ 1580లో
వియన్నాపట్టణమును ముట్టడించి క్రైస్తవలోకమునకు సంక్షో
భముకలుగఁజేయు నారంభించి ప్రపంచాధిపత్యమును స్వీకరించు
టకుఁ బ్రయత్నించెను. కానిఅందుకృతార్థుఁడు కాలేకపోయెను.
ఈసామ్రాట్టు తరువాత సామ్రాజ్యపీఠము నధిష్ఠించిన
యాతఁడు త్రాగుబోతు సెలీమనునాతఁడు. ఒక యార్మీనియను
దేశస్థురాలగు బానిసకును జక్రవర్తికిని బుట్టిన దాసీపుత్త్రుఁడై

యీతఁడు దుష్టగుణసమన్వితుఁడయ్యెను. దుర్బలుఁడు, శక్తిహీనుఁడు, మందుఁడునై యుండుటచే టర్కీ-సామ్రాజ్య మీతని కాలములో వృద్ధిఁజెందలేదు. ఈతనితరువాత రాజ్యపీఠము నధిష్ఠించినవారును బూర్వానుసృతముగా దుష్టత్వ దుశ్శీలత్వ దుర్బలత్వాదులలో నొకరినొకరు మించుటచేఁ గ్రమముగ టర్కీ-సామ్రాజ్యము మిక్కిలి క్షీణించి "యూరపుఖండపు రోగి" అను పేరువడసెను. పాశ్చాత్యరాజులు పరస్పరాసూయావిద్వేషభయములచే నీయూరపుఖండపు రోగి జోలి కెవ్వరునుబోవరైరి. తత్కారణమున నిది మహాసంగ్రామసమయమువఱకును దీర్ఘరుగ్ణతచేఁ బీడింపఁబడువాఁడెట్లు తన దుర్భరజీవనమును శయ్యాగతుఁడై గడుపుచుండునో, యట్లే యాటర్కీ-రాజ్యము నామమాత్రావశేషమైయుండెను.

టర్కీ సమ్రాట్టులు ధూసరవృక కేతనులు. త్రాగుబోతు సేలీమువఱకును వారు క్రూరస్వభావులైనను వారి సేనానులు బహునిపుణులు, బలవంతులు, శక్తివంతులు, ధైర్యవంతులునై యుండుటచేఁ టర్కీ-సామ్రాజ్యమును గ్రమముగ వృద్ధిఁ బొందించుచువచ్చిరి. త్రాగుబోతు సెలీమునుండి టర్కీ-సామ్రాజ్యమును బాలించిన చక్రవర్తులందఱును స్త్రీలోలురు నిరంతర స్త్రీభోగపరాయణులునై యుండుటచేఁ దమకు భోగస్త్రీ సంధానకర్తలైయున్న షండులపరముగఁ గొన్ని రాజ్యవ్యాపారములు నడుపనారంభించిరి. సమ్రాట్టులు కొజ్జాలగు నాతార్పుకాండ్ర యధీనులైయుండుటచేఁ బరిపాలకుల శక్తి

సామర్థ్యములు కుంటుపడెను. తగిన నాయకులు లేకుండుటచే ప్రజలు జ్ఞానవిహీనులైరి. శక్తిసామర్థ్యములను గోల్పోయిరి. భోగైక పరాయణులగుటచే దేహబలమును గాయకష్టములకోర్చు శక్తిని గోల్పోయిరి. ధర్మవిరుద్ధముగఁ దమ జీవితములఁ గడుపుచుండిరి. తత్కారణమున దుర్బలులగుటచే వారి యధీనమందున్న గ్రీస్టు, బల్గేరియా, సెర్బియా యను నీదేశ ప్రజలు వీరియధికారమును ధిక్కరించి స్వాతంత్ర్యమును సంపాదించిరి. ఇట్టియవస్థలో, ఇంగ్లాండు, ఐగుప్తు, కిప్రసు, అను దేశములను, ఫరాంసు, సిరియా, ట్యూనిసు అనువానిని, గషియా, క్రీమియా, కాకసు, అను వానిని నాక్రమించెను. రష్యయును, కానస్టాంటినోపిలు, అనునది తమదని చెప్పుచు డార్డెనల్సు మూలముగా మధ్యధరా సముద్రమునకు రష్యనులు మార్గమునుకోరిరి. ఇంతలో జర్మనీ రాజ్యము ప్రబలుచు నబ్దులుహామీదను టర్కీ చక్రవర్తిని తమయధీనము చేసికొని తదితర క్రైస్తవ ప్రభుత్వములను దూరమునను౦చెను. టర్కీమీద నిష్టముండి యిట్లు కావింపలేదు. టర్కీని గబళించు నుద్దేశముతోడనే నటుల సంచరించెను. జర్మనీ రాజ్య మిట్టియుద్దేశముతోఁ బొంచియున్నను “తానొకటి తలఁచిన దైవమింకొకటి తలఁచును” అను సామెత చొప్పున టర్కీ సామ్రాజ్యము విదారితమైనను జర్మనీ సామ్రాజ్యము మాత్రమంతరించినది. జర్మనీ ప్రాభవము గూడనడుగంటి

నది. కాలాంతరమం దదృష్టవశమున టర్కీ సామ్రాజ్యము పునరుద్ధరింపఁబడి ముస్తఫా కెమెలుయొక్క ధైర్య స్థైర్యములచేఁ బ్రపంచరాజ్యములలో వన్నెగాంచనారంభించెను.



## ౨

అలీరిజా యనునాతఁడు సెర్బియా టర్కీ దేశ ప్రాంతములనున్న యాల్బేని యాకొండలలోని తననివాసమును విడనాడి బాల్యముననే సలోనికాయను నోడరేవు జేరి యందొట్టొమనుఋణనిర్ణయశాఖలో గుమస్తాపని సంపాదించి సలోనికాలోఁ బురాణఖిల్లాయొక్క గోడలసమీపమున టర్కులు వసియించు పేటలో నివసించుచుండెను. జుబీడాయను నామె యాతనిభార్య బాల్కనుదీవులలోనుండిజరుగు నెగుమతియంతయు నీయోడరేవుననే జరుగుచుండెను. అదియొకపెద్దపట్టణముకాదు. సామాన్యమగు పల్లెయని చెప్పవచ్చును. ఈదంపతులు నివసించుచున్న గృహము శిథిలావస్థయందుండు యొక చిన్నసందులోనుండెను. ఈపేటలోని గృహముల తలుపులన్నియు నెల్లపుడును మూయఁబడియేయుండును. కిటికీలకుఁ గటకటాలమర్పఁబడియుండును. గృహము లెప్పుడును నిశ్శబ్దముగనుండును. ఎప్పుడైన నొకప్పుడు వీథులలో బాలబాలికలు కడునిశ్శబ్దముగ నాడుటగాని, లేక కాఫీగృహముల యెదుటఁ దగవరులు కాఫీని ద్రావినపిమ్మట సిగరెట్టులఁగాల్చుచు మాటలాడుచుండుటగాని జరుగుచుండును. ఇంతకు మిక్కిలిసవ్వడియేమియు నా సాలోనికాపట్టణమునం దగపడదు. మఱియు నీపేటలోని టర్కీయువతులు మంచినీటికొఱకు నీటిమరలకడకుఁ బోవునపుడును దమ ముఖము లితరుల కగపడకుండునట్లును, దాము వెలుపలిభాగ

మనుజుఁ జూచుటకొక కన్నుమాత్ర మగపడునట్లును నొక నల్లగుడ్డ బురకాను ధరించి తాము వెలుపలికివచ్చి గృహద్వారముల నతిశ్రద్ధతో మూసికొనిపోవుచుండుటయు గనపడుచుండును. ఘోషా యనెడు దురాచారము టర్కీ యువతులను పిశాచమువలెఁ బీడించుచుండెను. ఈ పేటలోఁ జాలవఱకు గృహములు గుడిసెలవలెను వాని ద్వారము లతిదృఢముగ లోహదండబద్ధములై యిరుగుపొరుగువారల రాకపోకలకైన ననువీయకయుండును.

ఇట్లు పరదా పిశాచపీడితలైన టర్కీ యువతులు చాలవఱకుఁ జదువుసంధ్యలేమియు లేనివారై యజ్ఞానాంధకారమున మునిఁగియుండి యుత్సాహ మిసుమంతయు నులేక ప్రపంచజ్ఞాన విహీనలై యెట్టెట్టులో సంసారయాత్రను సాగించుచుందురు. మన యోధుని తల్లియు నిట్టిజీవనమునే సాగించుచుండెను. ఆమె తన యేడవయేటఁ దాల్చిన ముసుఁగును ముప్పదియేండ్లనాడును మన కెమాలు పుట్టిన పిమ్మటఁ గూడఁ దీయలేదు. ఇట్టిస్త్రీలు స్వేచ్ఛతో బయటఁ దిరుగరని చెప్పుట యనవసరము; వారు గృహమును విడిచిపోవుటయే యరుదు. అప్పుడైన రక్షకులను వెంట నిడుకొనిపోదురు. జుబేడా తదితర టర్కీ స్త్రీ సామాన్యము వలె వ్రాయుటయుఁ జదువుటయు నెఱుఁగక ప్రపంచజ్ఞాన మిసుమంతయైనను లేక యంధప్రాయముగ జీవించుచుండెను.

ఆయమ తండ్రి దక్షిణపు ఆల్బేనియా దేశములో నొక కర్షకుఁడు. ఆమె తల్లి మాసిడోనియా దేశపు వనిత. ఆ జుబేడా పొడవుగను బలిష్ఠమగు దేహముకలదిగ నుండెను నల్లనికన్ను

లను దెల్లని శిరోజములనుగలిగి యారోగ్యభాగ్య సమన్వితమై యౌవనితాశిరోమణి తనకుటుంబములోని వారందఱును దన యాజ్ఞను మీఱకుండునట్లు మెలకువతోఁ బ్రవర్తించుచు, దన మాటకెన్నఁడు నెదురాడకుండునట్లు చేసికొనుచుండెను. ఉద్ధత చర్యలచే నుత్తేజింపఁబడిన యప్పుడు క్రోధావేశ దండవ్యామానమానస యగుచుండును. పూర్వాచార పరాయణయు దేశభక్తికలిగి జీవితసామాన్యమూలతత్త్వములను లెస్సగఁ గుర్తించి వివేకముతో నొప్పియుండెను

ఆలీరిజా జుబీదాల కిరువురుపుత్త్రులును నొక పుత్త్రికయుఁగలిగిరి. వారిలో జ్యేష్ఠపుత్త్రుఁడు పుట్టినతోడనే మరణించెను. పుత్త్రికనామము మక్బూలా. ద్వితీయపుత్త్రుఁడే మన కథానాయకుఁడగు ముస్తఫా. ముస్తఫా చిన్ననాటినుండియుఁ దోడిబాలురతోఁ గలిసిమెలిసి తిరిగి యాడుకొనక యేకాకియై తిరుగుచుఁ, దల్లికి ముద్దుబిడ్డఁడగుటచేఁ దనయెడ నామెచూపు ముద్దుమురిపము లామెకు విధాయకములుగఁ బరిగణించుచుఁ దల్లియెడఁ దాసించుకయు భక్తి నగుపఱుపకుండెను. మఱియు నాతఁడు దుర్బలుఁడు నస్థిపంజరమువలె నగపడుశరీరము కలవాఁడు మితభాషియునై జనని యాజ్ఞల నుల్లంఘించుచు నట్లుల్లంఘించునపుడామె సౌందర్య దండనమును విద్వేషించుచు శ్వేతనీలాక్షులను బీతరక్త శిరోజములనుగలిగి యత్యభిమానియు స్వతంత్రుఁడు ధృష్టుఁడునై ముస్తఫా పిత్రుగృహమునఁ బెరుగుచుండెను. ఆలీరిజాతన యుద్యోగమునకు రాజీనామానిచ్చి

కఱ్ఱవ్యాపారము చేయనారంభించెను. ముస్తఫాను వర్తకునిగఁ జేయఁ దండ్రి యుత్సుకుఁడై యుండఁ దల్లి యాతనిం బురోహితుని జేయ నిశ్చయించుకొనెను. తల్లి యాతనిని మొదట సరబ్బీ యక్షరములను నేర్చికొనుటకును, ఖొరానును స్వరయుక్తముగ నుచ్చరించు నేర్పలవఱచుకొనుటకును మసీదుబడికిఁ బంపెను. ఆబడిలోఁ గొంతకాలముండి యాపిమ్మట "చెమ్సి ఎఫ్పెండి" యను నాతని బడికొనికిఁ బంపెను. ముస్తఫా యచట విద్యాభ్యాసమును లెస్సగఁ గావించుచుండెను.

ఇట్లు కొంతకాలము గడచుచుండ నాలీరిజా హఠాత్తుగ మరణించెను. కఱ్ఱవ్యాపారమందాతనికి లాభమేమియు సంపాదింపఁజాలకపోవుటచే జుబీడా చేతఁగాసైన లేని దారిద్ర్యావస్థకు లోనై యిల్లు మూసివేసి సాలోనికా దగ్గరనున్న జలసాను గ్రామములోఁ గర్షకవృత్తిచే జీవించు తనసోదరునియొద్దఁ జేరెను.

ఏకాదశ వర్షప్రాయము కలిగియున్న ముస్తాఫా ప్రచండ వృత్తిఁగలిగి జననిమాటల సరకుఁగొనక ధూర్తుఁడయ్యెను. జుబీడామాత్ర మాతఁడు కర్షకుఁడో యాభీరుఁడో యగుట కిష్టపడక తనసోదరుని బ్రతిమాలి ముస్తఫాను పాఠశాలలోఁ జదివించుటకగు ఖర్చు నామె భరించునట్లొప్పించెను. సాలోనికాలో నొకపాఠశాల యందాతఁడు ప్రవేశించెను. కాని యచట నేవో యల్లరులచే సరిగాఁ జదువు జరుగకుండెను మన ముస్తఫా యుపాధ్యాయులవిషయమున విరోధభావముతోడను, సహాధ్యాయుల యెడను దంభాచార్యునివలెను దురాగ్రహ

ముతో సంచరించుచుండెను. ఆతఁడు తన సహపాఠులతో నాటలాడక వారు తనతో నేమైన జోక్యముఁ గలుగఁజేసికొనిన వారితోఁ గలహించుచుఁ బాఠశాలలోఁ గాలముగడుప నారంభించెను. ఒకనాడు బాలురందఱును గుమిగూడి కలహించుచుండ నుపాధ్యాయుఁ డొకఁడా మూఁకనుండి యాతనిం బైకి లాగెను. అంత నీతఁడా యుపాధ్యాయునిం బ్రహరింప మొదలిడెను. అందులకా యుపాధ్యాయుఁడు మిగుల నాగ్రహించి యాతనిని మెత్తగఁ జదుకఁగొట్టెను. అంతే ముస్తఫా కోపావేశపరుఁడై బడినుండి యింటికిఁ బాఱిపోయి మఱలఁ బాఠశాలకుఁ దిరిగి పోనని భీష్మించుకొని యింటియొద్దఁ గూరుచుండెను. జుబీడా సోదరి ముస్తఫా నింకొక పాఠశాలకుఁ బంపుటకు ఖుర్చు సేయుమనెను. తల్లి యెంతచెప్పినను ముస్తఫా యాపాఠశాలకుఁ బోనని పట్టుపట్టెను. జుబీడా యాతని ననునయింపఁ బ్రయత్నింప నామెకేమియు నుత్తరమీయక పట్టినపట్టును విడువకుండెను. ఆమె యాతనింగిని నిష్ఠురోక్తులు కొన్ని పలుక నాతఁడును గడునిష్ఠురముగా నామెకు సమాధానమొసఁగెను.

మాతులుఁడీ పరిస్థితినెల్లఁజూచి ముస్తఫా యెట్టివ్యాపారము చేయువాఁడుగను నగుపడ లేదనియు, నాతనిని యుద్ధవీరునిగఁజేసిన బాగుగనుండుననియు సాలోనికాలోని సైనికావరజ పాఠశాలలోఁ బ్రవేశపెట్టిన నాపాఠశాల టర్కీచక్రవర్తిచేఁ బోషింపఁబడుచుండుటవలనఁ దమకెట్టి వ్యయమును లేకుండ నాతని విద్యాభ్యాసము జరుగుననియు, నాతఁడు బుద్ధికలిగి

## ద్వితీయ ప్రకరణము

చదువుకొనిన నున్నతోద్యోగియగుననియు, లేనిచో సామాన్య సైనికుఁడైన నగుననియు, నిట్లైనచో వానిజీవిత నిశ్చయమగు ననియు జుబీడాకు బోధించెను. కాని యామె సోదరుని యుపదేశమును బెడచెవులఁ బెట్టెను. ముస్తఫాకుమాత్రము వాని యుపదేశము నచ్చెను. పొరుగింటియాతనికుమారుఁడు అహమ్మదను నాతఁడు సైనికావరజపాఠశాలలోఁ బ్రవేశించి చదువుచు సైనికవేషముతో విఱ్ఱవీఁగుచుఁ దిరుగుచుండెను. ఆ పరిస్థితి ముస్తఫా మనస్సునకు రుచించినది. అతఁడు పురోహితవృత్తినవలంబింపఁ దలఁచుకొనలేదు. వ్యాపారము యూదులు, ఆర్మీనియనులు మున్నగు పశుప్రాయులకుఁగాని టర్కులకుఁ గాదని యాతని యాశయము. సైనికుఁడై యున్నతోద్యోగము నలంకరించి యావేషముతో నధికారము చలాయించుట యాతని కభిమతము. కావున నాతఁడితరు లెవ్వరికిని జెప్పక తనతండ్రికిఁ బూర్వస్నేహితుఁడును నుద్యోగమునుండి విరమించుకొన్నవాఁడు నగు నొక సైనికోద్యోగిని బ్రతిమాలి తన సత్ప్రవర్తనవిషయమున నధికారులకడఁ బూట యుండుట కాతని నొప్పించి తదర్హతానిర్ణాయక పరీక్షయందుఁ గృతార్థుఁడై తన తల్లి మున్నగువారలకుఁ దెలియఁజేయకయె యా సైనికావరజపాఠశాలలోఁ బ్రవేశించెను.

ఆ పాఠశాలలోఁ గడు శ్రద్ధాసమన్వితుఁడై విద్యను గఱచుచు నందు నేర్పునందుచుండెను. కాని సహపాఠకులతోడను మఱియెవ్వరితోడను మైత్రిలేకపోవుటచే నేకాకిజీవనమును

గడపుచుండెను. ఎవ్వరైనఁ దన్ను నిష్ఠురోక్తులాడినను దన గుణదోష పరీక్ష చేసినను దురభిమానముచే వారిపై మండిపడు చుండును. తోడిబాలురెవ్వరైనఁ దనతో జోక్యము కలుగఁ జేసికొనిన వారితోఁ గలహించును. వా రాతనిఁ దమతోఁ గలిసి మెలిసి తిరుగుమని చెప్పినపుడు, నేకాకివై నీవు సంచరిం చుటకుఁ గారణమేమని ప్రశ్నించునపుడు నాతఁడు మిగుల తీవ్రముగ "నేను మీవలె నుండఁదలఁచుకొనలేను. పేరుప్రఖ్యా తులు గడింపఁ దలఁచితిని," అని వారికిఁ బ్రత్యుత్తర మిచ్చు చుండును. గణితశాస్త్రము, సాంగ్రామిక శాస్త్రము నా తని కభిమానశాస్త్రములగుటచేతను, వానియందాతనికి సహజ జ్ఞానముండుటచేతను యుద్ధవిద్యలో ముస్తఫా కృతార్థుఁడ య్యెను. ఈతఁడు పాఠశాలలోఁ బ్రవేశించిన రెండవ యేట నుపాధ్యాయులలో నొక్కరగు ముస్తఫా కెప్టెనుగారి కీతనిపై నభిమాన మంకురించి ఛాత్రోపాధ్యాయునిగా నతని నియమిం చిరి. వారియనుమతిచొప్పున నీతఁడు కనిష్ఠచ్ఛాత్రగణము నకుఁ బాఠములఁ జెప్పుచుండును. ఈ గురుశిష్యు లిరువురినామ ములు నొక్కటైయుండుటచే శిష్యుఁడగు ముస్తఫా తన నామ మునకు "కెమెలు" అనుపదమును జేర్చుకొనెను. అప్పటినుం డియు నాతఁడు 'ముస్తఫా కెమెలు' అను నామముతో వ్యవహ రింపఁబడెను.

పాఠశాలలో నీతఁ డతిచాతుర్యముతోడను దెలివితేటల తోడను విద్య నభ్యసించుచుఁ బరీక్షాపత్రముల కుత్తరములు

## ద్వితీయ ప్రకరణము

వ్రాయుటలో నత్యధికమగు కౌశలము నగపఱచుచు, ఛాత్ర గణము పైఁ దాను జెలాయించు నధికారమునకును, వారికిఁ దాను బోధించు బోధనవిధానమునకును దనలోఁ దా నానందించు చుండును. మఱియుఁ దన సహపాఠి యెవ్వఁడైనఁ దన్నతిక్రమింప ముందంజవేసిన నసూయాపరవశుఁడై వానిని ద్వేషించుచుఁ దనకుఁ బ్రతిద్వంద్విగా నెవ్వఁడైన విద్యాభ్యాసాదికమునఁ బాటుపడినవానిని నిరసించుచుఁ దాను గావించు కార్యములన్నిఁటిలో నిష్ప్రతిద్వంద్వముగా నద్వితీయుఁడై యుండుటకుఁ బ్రయత్నించుచుండును. ముస్తఫా కెస్తాను స్నేహ మీతనికి మేలుచేయలేదు. పదునాఱేండ్లు దాటకమునుపే యీతఁడు బాల్యావస్థ నతిక్రమించి యౌవనవిషయములలోఁ బ్రవేశించి యా యౌవనప్రయుక్త స్త్రీపురుషసంబంధములో నైసర్గికముగ బుద్ధి చొరఁబడుటచే క్షుద్రమగు నా మాలిన్యముచేఁ బూయఁబడి పొరుగింటి పడుచుతో నాచర్యను సాగింపఁజొచ్చెను. తోడిబాలు రాటలాడుకొనుచు నిష్కళంకానిర్వచనీయానందము ననుభవించుచుండ నీతఁ డుజ్జ్వలవేషధారియై వీథులలోఁ దిరుగుచుఁ గిటకటాలకు వెనుకనుండు యువతులపై శృంగారవీక్షణములఁ బఱపుచు విపణిమార్గమధ్యగత పణ్యస్త్రీలపైఁ గేరింటి పరిహాసములను జేయుచుండును. పదునేడవయేట ముస్తఫా సాంగ్రామికావరజ పాఠశాలాపరీక్షలో గౌరవప్రథమముగ నుత్తీర్ణుఁడై మొనాస్తిరున్నతసాంగ్రామిక పాఠశాలకు విద్యాభ్యాసమునకై పంపఁబడెను.



# 3

టర్కీ సామ్రాజ్య మంత్యావస్థకువచ్చినపుడు క్రైస్తవ ప్రభుత్వములు క్రుంగుచున్న టర్కీ సామ్రాజ్యములోనుండి ఫలవంతములైన దేశఖండముల నపహరింప నుద్యమించెను. ఏక ఫలాపేక్షులకు మైత్రియుండదు కావున నీ క్రైస్తవప్రభుత్వ ములును బరస్పర మైత్రిలేక యామిషఖండమునకు శ్వానముల వలెఁ గలహింపను సంసిద్ధులైయుండెను. టర్కీ సామ్రాజ్యమం చెటుచూచినను బ్రజలలో శాంతిసౌఖ్యములు లేకుండెను. గ్రీసు ప్రభుత్వమువారు క్రీటు నాక్రమించిరి. క్రీటు టర్కీసామ్రా జ్యములో నొక ద్వీపము. టర్కీ ప్రభుత్వము గ్రీసుతో యుద్ధ ముచేయ నిశ్చయించి సేనలను యుద్ధరంగమునకుఁ దండోప తండముగ నడుపనారంభించెను. బండిఫిరంగులు నశ్వదళములుఁ గాల్బలముఁ బ్రతిదినము నెడతెఱపిలేక నడపుచు మొనస్టిరును ధూళిచేఁ గప్పెను. రేయింబవలు లెటుచూచినను దిక్కులు మాఱుమ్రోగునట్లు సైనికరవము చెలరేగుచుండెను.

కళాశాల సెలవుదినములలో ముస్తాఫా సెలోనికాకు వెళ్లెను. కాని యాతని తల్లి రోమునకుఁజెందినయొకధనవంతుని వివాహమాడియుండుటచే సాధ్యమైనంతవఱకు నామె ముస్తాఫాను జూడకుండుటకే ప్రయత్నించెను. కఠినముగా మాటలాడు స్వభావముగల యీ కెమెలు తనతల్లితోఁ దానావివాహము నంగీకరింపలేదని చెప్పెను. అందులకు మాతాపుత్రులొకరితోనొకరు కలహించిరి. కెమెలు తనతల్లి క్రొత్తమగని (మారుతండ్రి)తో మాటాడుటకూడ మానివేసెను.

# తృతీయ ప్రకరణము

ఆ సెలవులలోఁ గెసెలు దామినికసిద్ధాంతావలంబకులగు మఠవాసులు కొంతమందితో మైత్రిసేసి వారివద్ద పరాసుభాష నభ్యసించెను. జీబ్రిడావాసియగు మోసిజోని యను జాతికిఁ జెందిన ఫెడ్‌తో స్నేహము చేసి వారివలనను వాల్టేరు, రూసో, మున్నగు రాజ్యపరిస్థితివాదుల గ్రంథముల బఠించుచు హాబ్సు, లాకు, స్పినోజా మున్నగువారల యాధిశాస్త్రసిద్ధాంతముల పరిచయమును గాఢముగఁ గలుగఁజేసి కొనెను. రాజాజ్ఞ యీ గ్రంథములను బఠనీయములు కాదని నిషేధించెను. ఎవ్వరివద్ద నీ గ్రంథములుండునో వారిని జెరసా యందుంచవలయునని రాజాజ్ఞ. ఆ కారణమునే ముష్టుఫా కాగ్రంథములయం దభిరుచి మిక్కుటమయ్యెను

ఈ కాలముననే కెసెలు వక్తయగుటకుఁ బ్రయత్నించుచుఁ దోడివిద్యార్థుల సమావేశమునఁ బరదేశీయుల భయమునుండి దేశమును సంరక్షించుట, లోకకంటకుఁడైన సురతాను పీడనమునుండి దేశమును గాపాడుట, మున్నగు విషయములఁగూర్చి యత్యుత్సాహముతో నతితీవ్రముగు నుపన్యాసముఁ జేయుచు, స్వాతంత్ర్యము, స్వేచ్ఛ మున్నగువానిఁ గూర్చి యుపన్యాసములను గ్రంథములను నుద్రేకజనకములు గంభీరములునగు పద్యములను వ్రాయుచుండెను. ఈ మొనస్టరి పాఠశాలలో నితఁడు వివిధ శిక్షలంబొంది పరీక్షలలో నుత్తీర్ణుఁడయ్యెను. ఉపాధ్యాయు లితనిఁగూర్చి "ఈతఁడు మహామేధావి దుర్విజ్ఞేయస్వభావుఁడు. స్నేహమునకులొంగి దానిం బరిపా

లించు స్వభావముకలవాఁడు కాఁడు" అని వ్రాసిరి. సామాన్యోద్యోగిపాఠశాలలోఁ జదువుట కెన్నకొనఁబడి కాన్స్టాంటునోపిలులోనున్న హార్బియా యను పాఠశాలలో సబులెప్టినెంటుగా నియమింపఁబడి యటకుఁ బంపఁబడియెను.

హార్బియా పాఠశాలలో విద్యార్థిగాఁ బ్రవేశించునప్పటి కీతనికిరువదివత్సరముల ప్రాయముండెను. ఈ త ని కి ప్ప టి కిఁ బ్రపంచానుభవమేమియును లేదు. సెలోనిక, మొనస్టిరుననునవి చిన్నపట్టణములగుటచే వానియందు సామ్రాజ్యమునకు రాజధానియగు కాని స్టాంటునోపిలునందువలె వైభవమేమియు లేకుండెను. ఈ రాజధాని సకలకాలవాలమైయున్నను వ్యభిచారాది మహాచారములకుఁ గూడ నిలయమైయుండెను. ఈతఁడీపట్టణమునకుఁ జేరిన మొదటిలోనే దుర్వ్యసనములలో మునిఁగిపోయెను. ప్రతిరాత్రియు జూదమాడుచు సురాపానమందిరములకేగి మద్యసేవకావించుచుండెను. గలాటావంతెసకడమాలభూయిష్ఠమార్గముల ప్రక్కనుండు వేశ్యాగృహములలో నివసించు నాక్సనియను గ్రీకులంజెంతోడను, పంగల్డిలో వాసమేర్పఱచుకొని యుండువెవాంశైనురండలతోఁను గామకేళీసుఖముల ననుభవించుచుండెను. మఱియుఁ పెరాలో నొట్టాంబూలులోనే సంకేతగృహమునకు రాజభటభయముచే నితరులకగపడకుండనుండున ట్లాచ్ఛాదనముచేసికొని వచ్చెడు టర్కీపణ్యస్త్రీలతోడను కేళీవిలాసముల సల్పుట కారంభించెను. ఈతఁ డీపణ్యాంగనల నెవ్వని బ్రేమింపలేదు. కేవలముఁ

దాత్కాలిక సుఖానందమునకు మాత్ర మాతఁడు వ్యభిచరించె డివాఁడు కాని శృంగార రసపోషణమునకుఁ గాదు. తనకుఁ గామపరిభోగతృప్తి తీరినతోడనే యాతఁ డాపణ్యస్త్రీని విడిచి పోవుచుండును. ఉంపుడు కత్తెలనుంచుట యాతని కభిమతము కాదు. ఒకతె వెనుకని కొకతె చొప్పున నెందఱు వారకామినులాతనిచేఁ బరిగ్రహింపఁబడి పరిత్యజింపఁబడిరో చెప్పఁజాలము. స్త్రీల నాతఁడు కామపరితృప్తి కొఱకే కాని మఱియొందులకు నుపయోగింపలేదు. ఇట్లాతఁడు కొంతకాలము దుర్వ్యసనమును విడనాడి యంతటినుండియుఁ దదేకదీక్షతోఁ బాఠశాలలో విద్యాభ్యాసముచేయ నారంభించెను. అన్నిపరీక్షలలోను నునిసితప్రతిభతో నుత్తీర్ణుఁడగుచుండెను. విశిష్టములగు సామాన్యోద్యోగుల యధ్యయనక్రమములోననుభవము గడించుటకు నియమింపఁబడి తత్సంబంధములగు పరీక్షలలోఁ బ్రజ్ఞతో జయముఁ గాంచుచుండెను. ఇట్లు క్రమముగా నతఁడు మిక్కిలి త్వరితముగా నున్నతపదవులను బడసి 1901 సంవత్సరము జాన్యువరి మాసమున కప్తానుగా నియమింపఁబడెను.

హార్బియాలోనేకాక మానిస్టిరు పాఠశాలలోనున్నపుడు కూడ మనకెమెలు రాజకీయములలోఁ బాల్గొనుచుండెను. ఈతనితోడి సహాధ్యాయులందఱును రాజ్యపరివర్తన సిద్ధాంతావలంబకులైరి. వారందఱును దేశనాశకమగు సుల్తాను నియంత్రితప్రభుత్వమును, బరప్రభుత్వములు తమపైఁజూపుచున్న యత్యాచరణమును విద్వేషించుచుండిరి. "వతను" (జన్మ

భూమి)లను పేరంబరగు రాజ్యపరివర్తనకారి సంఘమునఁజేరి వారు తత్సంఘకార్యములలోఁ బాల్గొనుచుండిరి. పత్రికలం గూర్చి యధ్యాపకులకుఁ దెలిసినను దెలియనియట్లే సంచరించు చుండిరి. ఇట్టి కపటాజ్ఞానమును జూపినవారు సంపూర్ణదేశ భక్తులనూత్రి మంగీకరించుచుండిరి. ఈ సంఘను సురతానుగారి పురాణరాజ్యపాలనవిధానమును, వారి సహాయయుక్తులగు నుద్యోగులను, వారి ప్రజాహింసాకరపద్ధతిని, మహామహులగువారిని నశింపఁజేయువారి కార్యమును విద్వేషించుచుండిరి. పురోహితులను శత్రువులుగఁ బరిగణించు చుండిరి. ప్రవృద్ధినిరోధకమగు నిస్లాము మతశాస్త్రమును నిరోధించుచుండిరి. జనులం బీల్చి పిప్పిచేయుచున్న మఠములను మసీదులను మఠస్థులను శపించుచుండిరి. నిష్ఫలములు నిరుపయోగములుఁగు గొరానుపై నాధారపడియున్న ప్రాచీన ధర్మశాస్త్రములను నిందించు చుండిరి. ఈ పతను సంఘసభ్యులు సురతాను నియంత్రిత ప్రభుత్వమును నిర్మూలముఁగావించి వ్యవస్థను రూపక ప్రజాపరిపాలనవిధానానుసారియగు ప్రభుత్వమును స్థాపించుటకును, బరోధనవ్యాపారములకుఁ బ్రజలామిషముగాకుండ వారిని రక్షించుటకును, స్త్రీలు నవగుంఠనవిధానమునుండియుఁ బహుప్రియమగు నవరోధవాసమునుండియు, విముక్తులుగఁజేయుటకును వీరు శపథముఁ బూనిరి. సురతాను నాతని పరివారకులు టర్కీ-రాజ్యమును నిర్మూలము కావించుచుండుటచే సామ్రాజ్యము రక్షింపవలెనన్న సమాప్తమునుండి యధికారమును లాగి

కొని ముదిమిచెందిన ట్లగపడుచున్న టర్కీ సామ్రాజ్యపు రక్త నాళములలోనికి నూతన జీవనప్రదరక్తమును బ్రాప్తింపవలసి యున్నదని వారి యాశయము. మన ముస్తఫాకెమలు వతను సంఘసభ్యుఁడై సంఘసమావేశములలో నతి తీక్ష్ణముగ నుపన్య సించుచు, వతను సంఘముచేఁ బ్రకటింపఁబడు లిఖితపత్రిము లలో నతి తీవ్రమగు నుపన్యాసములను భావోద్రేకము నొంద వించుపద్యములను వ్రాయుచుండెను. ఈ వతను సంఘకార్యము లను బాఠశాలాధ్యక్షుఁడు బాగుగఁ దెలిసికొన్నను బెడఁదముగ ముతో నావిషయములు తెలియనట్లు సంచరించుచుండెను. సురతాను బారువసాంఘికుల చర్యలఁ దెలిసికొని చక్రవర్తికి నివేదించిరి. అదివిని సురతాను మనోవైకల్యమునుజెందెను. సంఘసభ్యులప్పటికిఁ బ్రపంచజ్ఞానములేని యువకులేయైనను వారు భావిసైన్యాధికారులు సైనికులునగుటచే నారాజునకుఁ గొంత యను మానమును భీతియు జనించుటచె నాతఁడు సైనికశిక్షా విధానమును నడిపించు నత్యున్నతాధికారియగు నిస్మేలుహాకీ పాషాయను నాతనికివతను సంఘమును నిర్మూలింప నాజ్ఞాపించె ను. ఈ హకియను నతఁడు పాఠశాలాధ్యక్షుని దీవ్రముగ మందలించుటచే నాతఁ డప్పటినుండియుఁ బాఠశాలావరణ ములో వతను సంఘసమావేశములు జరుగకుండఁ గట్టడచెసెను సభ్యులును దమ సమావేశములను బాఠశాలకు వెలుపల జరు పుకొనుచుఁ గానస్టాంటినోపిలులోనున్న యనేక గూఢసంఘ ములలో నొకటిగఁ దమ సంఘమును జేసిరి.

పరీక్షలలోఁ గృతార్థుఁడైనపిదపఁ గొంత కాలమే యుద్యోగమును లేక యాతఁడు నిర్వ్యాపారియై యుండెను. ఆతని జనని యాతనికి ధనమిచ్చుచుండుటచే దారిద్ర్యబాధ యంతగా నాతనికిఁ గలుగలేదు. ఇట్టియవస్థలోఁగూడ నీతఁడు వతను సంఘమునెడ నశ్రద్ధవహింపక తత్కార్యక్రమమును నడిపింపఁ బూనుకొని యొక చిన్నసందులోఁ జిన్నగదినొకదాని నద్దెకుఁదీసికొని యందువతను సంఘకార్యస్థానమును స్థాపించెను ఈ సంఘసమావేశములను మాత్రము మిక్కిలి రహస్యముగ మిత్రులగృహములలోనో కాఫీగృహములలోనో, వెనుకభాగమందుండు గదులలోనో జరిపించుచుండెను. సురతానుచారులు వీనిని నివారింపనెన్నియో యుపాయములఁ బన్నుచుండిరి. ఈ సంఘకార్యములను నిర్వహించుటలో నుండవలసిన నిగూఢతయు దానివల్ల సంభవించు నుపద్రవమును నాతని నుత్సాహపూరితునిగ నొనర్చుటయేగాక రాజ్యపరివర్తన వ్యూహానాంకేతికత్వమును, గణానిర్మాణమును, సంఘములో నూతనముగఁ బ్రవేశించిన వారిభక్తిని బరీక్షించు విధానమును, హస్తగ్రహ రహస్యసహిత సంచారవచనసంకేత ప్రతిసంకేతములను నుపయోగించు విధానముం దెలిసికొనెను.

వతను సభ్యులిట్లు సమావేశముల జరిగించుచుండ నీ సమావేశసమయమున నీ సభ్యులనుబట్టుకొను నుద్దేశముతోఁ దమ కాత్మీయుఁడగు నొకానొకని బ్రతినిధిగ వారి సంఘములో బ్రవేశపెట్టిరి. ఈ క్రొత్త ప్రతినిధిని తమసంఘములోఁ జేర్చుకొనుట

కొంసభ్యులుత్సాహపూరితులై యుండిరి గాని వానివల్లఁ గలుగ బోవు నాపదప్రాయమును గురుతింపరైరి. లోకానుభవములేనివార గుటచే నీసభ్యులు పోలీసు ప్రతినిధిని దమసంఘములో సభ్యు నిగఁజేర్చుకొనుటకు సభ్యులసమక్షమున జరుపఁదగు శపథపాల నము మున్నగు కార్యకలాపమును నిర్వహించుటకై కావింపఁ బడు సమావేశము జరుగుకాలమును దెలియఁజేసిరి. పిమ్మట నిర్ణీతసమయమున సభ్యులెల్లరును సమావేశమైరి. కాని రక్షకభటులు వారినందఱనుబట్టుకొని చెరసాలలో బంధించిరి. వీరందఱిలోను ముస్తఫా కెమెలు పెద్దవిద్రోహిగాఁ బరిగణింపఁ బడుటచే నితర విద్రోహులనుండి యాతఁడు వేఱుచేయఁబడి యేకాంతగృహమున బంధింపఁబడెను. ఈతఁడు పెద్దవిద్రో హియని రక్షకభటులు సుదృఢమైన సాక్ష్యమును దయారుచే యుటచే నీతనికెట్టిశిక్ష విధింపఁబడునో యెవ్వరి యూహకు నందకుండెను. రక్తకారాగారమున బంధింపఁబడినవారిలోఁ బలువురవఱకు నిర్మూలింపఁబడుటచే నదృశ్యులైరి. కెమలు చేసిన నేరము ఘోరమైనదని సురతాను హించినచో ననేక వత్సరము లాతఁడు చెరసాలయందు బంధింపఁబడుటయో, దేశ బహిష్కృతుఁడు గావింపఁబడుటయో యాకారాగారమందే నిర్మూలింపఁబడుటయో జరుగకతప్పదు. జుబీడాయనుసోదరియు నాతనిం జెరసాలలో దర్శించుటకుఁ బ్రయత్నించిరిగాని వారి ప్రయత్నము నిష్ఫలమయ్యెను. వారాతనికెంతధనమంపినను గీటకావృతము మాలిన్యయుక్తము నంధకారబంధురముఁ బవన

సంచార విహీనమునగు సంకటకోష్ఠబంధన మాతని కపార సంతాపజనకమై మనమునం గడుదారుణమగు దుఃఖము నొదవించుచుండెను.

ఇస్మేలుహాక్కీపాషాగారి సమక్షమున కొకనాడు రక్షకభటులతని దోడుకొనిపోయిరి. సురతానున కాయుద్యోగి యన్నం గడునిష్టము. అప్పుడాయుద్యోగి కడుగంభీరముగా "నీవు కడుబుద్ధికౌశలము నగపఱచితివి. చక్రవర్తి సేవచేయుటకు నీకిష్టమున్ననున్నతపదవి నలంకరించు భాగ్యము నీకు లభింపంగలదు. కాని నీవు ధరించిన దుస్తులకు నీవేషమునకు నీకును లజ్జాకరమగునట్లపయశస్సు నార్జించితివి. అధమాధములతో సహవాసముచేయుచు జూదమాడుచు సురాపానముం చేయుచు నతి నీచపణ్యస్త్రీలతో వ్యభిచరించుచు నుంటివి. అంతకు మిక్కిలి హీనమగుకార్యము రాజద్రోహము నాచరించితివి. రాజవిరోధులతోం గలిసి తిరుగుచుంటివి. రాజునకనిష్టమగు దుష్టప్రచారము చేయుచుంటివి. రాజ్యపరివర్తన ప్రసంగములోం బాల్గొనుచుంటివి. అంతియకాక యట్లొనరించుటకు నీ మిత్రులను బ్రోత్సహించుచుంటివి. అట్లైనను జక్రవర్తి కినియొక నీమీందం దవీక్షణములం బ్రసరింప నిచ్ఛగించుంచున్నాండు నీవు చిన్నవాండవు మంచిచెడ్డలను గురుతింపజాలనివాండవు. నీలో దుర్మార్గతకంటె నున్మత్తతయు నుపపన్నత యధికమేమోయని నా కనుమానము."

"డమస్కసులోని యశ్వదళములో నీకుద్యోగము కాంగలదు. నీపనినిగూర్చి నీపై యధికారిచ్చు నభిప్రాయము

ననుసరించి నీ యభివృద్ధియుండును. కావున నిట్టి యవిచారిత జీవనమును విసర్జించి నీ యుద్యోగవిధులలోఁ గట్టి శ్రద్ధతో మెలగవలయును. నీ కింకొక యవకాశమిట్టిది లభించదు. కావున జాగరూకుఁడవై మెలఁగుము." అని కఠినోక్తులుపల్కి యానాటి రాత్రియందు సిరియా దేశమునకుఁ బోవుచున్న యొక నావపై నాతని నెక్కించి యాతని తల్లినిగాని స్నేహితులనుగాని చూడనీయకుండనే పంపివేసెను.

డెమస్కసునకు దక్షిణమున నున్న హు: పర్వత శ్రేణిలో డ్రూసుజాతివారు వసించుచుందురు. వారెప్పుడును సురతాను ప్రభుత్వముపైఁ దిరుగుబాటుచేయుచుందురు. కెమలు డెమస్కసునుజేరునటికి నచటి సైన్యము డ్రూసుల లొంగఁదీయుటకై దాడివెడల సంసిద్ధమైయుండెను. కెమెలునకిదియే ప్రప్రథమ యుద్ధ పరిచయము. ఇంతకాలము వఱకు నాతఁడు సాంగ్రామిక పాఠశాలలో సమరశాస్త్రము నభ్యసించెనుగాని యే యుద్ధము నను బాల్గొనలేదు. తన శాస్త్రజ్ఞాన ముపయోగించుటకు సమయము కలుగవలసినదే కాని దేశనైసర్గిక పరిస్థితులును డ్రూసుల యుద్ధ విధానమును నట్టి శాస్త్రజ్ఞాన వినియోగమునకుఁ జోటీయలేదు. దేశమంతయుఁ బర్వతమయమైయుండెను. పర్వతములలో శిలాపూరిత దరులుతప్ప వేఱొకటియు లేకుండెను. డ్రూసులు సురతాను సైన్యముతో నిలిచి పోరాటము సాగింపక శేయింబ వళ్ళ ఱాళ్ళసందులనుండియు దారితెన్నులేని గుట్టలమీఁది నుండియుఁ దుపాకులఁ గాల్చుచు రాజ్యసైన్యమునకు బాధ

కలుగఁజేయుచుండిరి. ఎక్కడనైన ద్రూసులు గుమిగూడినట్లు తెలియఁగనే టర్కీరాజ్యసైన్య మతికష్టముతో నా పర్వత మార్గముల ననుసరించి వారితో యుద్ధముచేయుటకుఁ బ్రయాణము సాగింపఁగనే ద్రూసులు చెల్లాచెదరై యన్నివైపుల నుండియు శతఘ్నిగోళ పరంపరను వారిపై గురిపించుచుందురు. కావున గ్రంథసంచయమువలన యుద్ధనైపుణ్యము సంపాదించిన మన యోధపుంగవునకీదాడి యెట్టి యుపయోగమును గలుగఁ జేయలేదు. టర్కీసైన్యములుకూడ ద్రూసుల నేమియుఁ జేయజాలక నిర్మానుష్యములగు పల్లెలలోని వారి గృహములను బరశురామప్రీతి కావించియు, వారిపంటల నశింపఁజేసియు సీత కాలమును గడపుటకుఁ దిరుగ డెమస్కసును జేరకొనిరి.

ఈవఱకు బందీగృహమున గలిగిన యనుభవముచేత నెంతమాత్రము కెమెలు పిఱికితనముఁ జెందక ధైర్యముతో మెలగుచుండెను. హకీపాషాగారి బెదరింపులవలన కెమెలు భీతిఁజెంద లేదు. కెమెలు రాజకీయసంస్కరణాభిమాని. దైవము రాజ్యసంస్థాపనము నరులునని నాతనికి సహజముగ గౌరవము లేకుండెను. పవిత్రమైనదాతని కేదియును లేదు. సుస్థాపితమైన దేదియును లేదని యాతని దృఢవిశ్వాసము. కారాగృహ విమోచనానంతరమం దతఁడు యువకులకుండవలసిన సహజమగు నుత్సాహముతో జాగరూకత కలిగి సంచరించుచు వ్యవహారవిషయము లన్నియు నంశములను లెస్సగఁ బరిశీలించి పాటుపడుటయుఁ బ్రారంభించెను. కార్యతత్పరతను గవితాసారస్వతాదుల సేవ

కను విరోధభావమున్నదని నిశ్చయించి యాతఁడు తత్కార్యములను విడనాడెను. గ్రంథపఠనము మనోనిశ్చయమును దుర్బలముగ నొనర్చుననియు, నసత్యార్థాభిలాషలను గలుగఁజేయుననియు, వ్యాపారవిరుద్ధమగు బుద్ధినిబుట్టించుననియు వాని నమ్మకము. ఆతఁడు డెమస్కసుచేరగనే సారస్వతసేవను విడనాడి రాజ్యపరివర్తనముచేయుట కవసరములైన విషయములను తెన్నగా నేర్పాటుచేయుచుండెను. పిన్నవయస్కులగుఁ తోడి యుద్యోగులందఱును రాజ్యపరివర్తన సిద్ధాంతావలంబకులును, నా యుద్యోగులలోని పెద్దలు పిన్నవారి యాశయములపై సానుభూతిని జూపువారునని ముస్తఫా తెలిసికొని పూర్వసహాధ్యాయుడైన ముఫిడను నాతని బ్రోత్సహింప నాతఁడు వీరి సాయముతో రాజ్యపరివర్తనకారి సంస్థాపనము నతిత్వరలో నేర్పాటుచేసి డెమస్కసునుండియే రాజోపద్రవమును గలుగఁజేయ నుద్యుక్తుఁడైయుండెను. దానికి ముస్తఫా కెమెలు అండయైయుండెను. సైనికోద్యోగులందఱును తిరుగుబాటుచేయుటకు సంసిద్ధులైరికాని యక్కడి ప్రజలుమాత్ర మనుకూలింపక వీరికి విరోధభావము నగపఱచిరి. బాల్కనుమండలమే రాజోపద్రవకారకులకునికి పట్టనియు, సెలోనికాపట్టణమున కుద్యోగము మార్పించుకొనిన నభీష్టార్థములు కొనసాగఁ గలవనియు మన కెమెలునకు స్నేహితులుపదేశించిరి. బాల్కనుమండల ముపద్రవములకుఁ గేంద్రస్థానమగునో కాదోయని కనుగొనుటకు సెలవిచ్చినను నీయకున్నను దత్స్థానమునకుఁ బోవ

నిశ్చయించి యధికారులయొద్ద నల్పసమయమునకుమాత్రము సెలవుఁదీసికొని కెమెలు జప్ఫాయను రేవుపట్టణమును జేరెను.

ఆపట్టణములోనున్న సైన్యాధికారి వతను సంఘసభ్యుఁడగుట సహాయ్యముచేయుదు నాతఁడు. కెమెలు సెలోనికాపట్టణమునకు గుప్తముగాఁ బోవుటకుఁ దగిన సదుపాయములను జేయుట కాతఁ డంగీకరించెను. అతఁడు మాఱుపేరు ధరించి కృత్రిమాభిజ్ఞాన పత్రముల సృజించి వర్తకునివేషమును వేసికొని ఐగుప్త దేశమునకుఁ బోవుచున్న యొక యోడపైఁ బ్రయాణమయ్యెను. అచటినుండి యాథెన్సు పట్టణమునకును నచటి నుండి సెలోనికాపట్టణమునకును జనెను. ఆ ప్రదేశములో నెచటఁజూచిన నసంతృప్తియు గుప్తసంఘముల రాజ్యపరివర్తన ప్రారంభ చిహ్నములును గాన్పించుచుండెను.

కెమెలు సెలోనికాపట్టణమునకుఁ జేరి తనతల్లి యింటి లోని యధికారులకుఁ దెలియకుండ దాగియుండి యచటి పరిస్థితులు పరీక్షింప నారంభించెను. సెలోనికాపట్టణ ముపద్రవము లకుఁ గేంద్రస్థానమని యాతఁడు తెలిసికొని యచటఁ జేరిన వెంటనే తనపెద్దతల్లి సాయముతోఁ గొందఱుద్యోగులను దర్శించి తన్నాయూరిలోనున్న సైనికోద్యోగ పాఠశాలలోనికి బదిలీచేయుఁడని విన్నవించుకొనెను.

సురతానుచారులు కెమెలును గనుఁగొని తమపై యధికారులకుఁ దెలియఁజేసిరి. ఈతనిని వెంటనే బంధింపవలయునని

యాధికారులు హుకుము జారీచేసిరి. పోలీసునాయకుని సహ కారి జెమెలను నాతఁడు కానస్టాంటినోపిలులోని వతను సంఘ సభ్యుఁడు. ఆపోలీసునాయకుఁడు జారీచేయించబడిన హుకుమును కెమెలునకు దెలియఁజేసి యాతనిం గాపాడుకొమ్మని కోరెను. రెండురోజులకన్న నెక్కుడు కాల మధికారులు జారీచేసిన హుకుము నమలుచేయకయుంచరాదని యాతఁడనెను. విధిలేక కెమెలు మిగుల ప్రయాసముతో గ్రీసుదేశప్రాంతమునకుఁ దప్పించు కొనిపోయి యచటనుండి నావపైని జాఫ్ఫాకుఁబోయి చేరెను. ఈతనిని బంధింపవలెనను హుకుమిచటికిఁగూడ వచ్చియుండెను. కావున సహాయ్యమునుజేయను నాతఁడు కెమెలు జెఫ్ఫాలో దిగ కుండఁగనే కెమెలుయొక్క నిర్విశేష వేషమును నభిజ్ఞానపత్రము లను నోడలోనుండఁగనే యాతని కందఁజేసి యెవ్వరికిని దెలియ కుండ నాతనిని గాజాయనుచోటికిఁ బంపివేసెను. గాజాకు సమీపభాగములలో నేదియోకలకలము సంభవించినది ముఫి దులుట్ఫియను నాతఁడాప్రదేశములోని యల్లకల్లోలమును జల్లార్చుట కేర్పఱుపఁబడిన యుద్యోగి. అహమ్మగారే కాన స్టాంటినోపిలులోనున్న పై యధికారులకు విన్నవించుకొనెను. తనకు జారీచేయించిన హుకుము పొరపాటునఁ గావింపఁబడిన దైయుండి యుండవలెననియు నేదియైనను దానుచేయవలసిన విధులఁగూర్చి తిరిగి హుకుము లంపవలెననియు నివేదించుకొను నంతలో ముఫ్తిదులుట్ఫియా యుదంతము సత్యమైనదేయని పై యధికారులకు వ్రాసికొనెను. తుదకిట్లు కొన్నివారములుత్తర

ప్రత్యుత్తరముల నడిపి యీ విషయము పైకిరాకుండ కెమెలు యొక్క స్నేహితులు తొక్కి వేసిరి.

పిమ్మట నొక సంవత్సరముపాటు కెమెలిట్టి విపరీతచర్య లేమియుఁజేయక తనవిధుల సతిశ్రద్ధతో నిర్వర్తించుకొనుచుం డెను. అంత నతనిపైయధికారులు కెమ లధికారపదవికి యోగ్యుఁడనియుఁ దనకర్తవ్యము సతిశ్రద్ధతో నిర్వర్తించుచు న్నాఁడనియు కాన్స్టంటునోపిలులోని పై యధికారులకుఁ దెలి యఁజేసిరి. వారు సెలోనికాలోని చారులు పొరపాటుపడి రనియు కెమెలు బాలిశ్యమును విసర్జించి సన్మార్గవర్తియై యున్నా డనియు యోచించి యూరకొనిరి. సాంగ్రామికాధికారస్థానము లలో నధికృతులైన వారియందు వతను సంఘసభ్యు లెవ్వరో తెలిసికొని సెలోనికాలోనికి బదలీచేయించుకొనుటకు సర్వవిధ ప్రయత్నములను సలిపి తుదకు సఫలప్రయత్నుఁడై త్వరిత ముగా రాజపరివర్తనకార్యకే దస్థానమగు సెలోనికాను జేరెను. టర్కీయందలి మూఁడవ సైనికదళాధికారవర్గములో నొకపదవి యీతనికీయఁబడినది. ఈ నూతనాధికారవర్గమువల్ల నాతనికిఁ గొంతకాలము సెలోనికాలోను గొంతకాలము రైలు పరీక్ష నొనర్చుచుఁ బ్రయాణముచేయుటలోను గడుప వలసివచ్చుచుండెను. సెలోనికాలోనున్నపుడు జననీసోదరులతో గలిసి వసించుచుండెను. కెమెలు మాఱుతండ్రి మరణించుటచే జుబీడాకు సెలోనికాపట్టణ మధ్యభాగమున నొకపెద్ద గృహా మును గొంతధనముఁగూడ సమకూడినవి.

# తృతీయ ప్రకరణము

ముస్తఫా నధికారపాఠశాలలో నెఱిఁగినవారు సేనలో నుండిరి. వారిసాయముతో నాతఁడొక వతనుసంఘముయొక్క నూతనశాఖను నిర్మింపయత్నించెను. కాని వారు మాత్రి మాతని సంభాషణ వినుచు వానితో నేమియుఁ బ్రసంగింపక వాని నొకచారునిగ ననుమానించుచున్నట్లు నటించుచుండిరి. ఒకప్పుడు వారి గుంపొకచోట మాటాడుచుండెను. ఆసమయమునఁ గెమెలు వారియొద్దకుఁబోయెను. అప్పుడు వారుతమసంభాషణనుగట్టిపెట్టి యూరకుండుటచే వారేదియో రహస్యకార్యమునుచేయఁబూనినట్లాతనికిఁదోచెను. కాని వారుచేయఁబూనిన కార్యముమాత్ర మాతనికిఁ దెలియదయ్యెను. అయినను తుద కాగుంపులోనొకఁడు కెమెలు రహస్యముగనుంచుట కంగీకరించి యొట్టుపెట్టుకొనునటుల చేసి తరువాత సెలోనికాలో ఘనమగు రాజ్యపరివర్తన సంఘమొకటి యేర్పడియున్నదనియును, దానిపేరు "ఐకమత్యప్రవృద్ధి" అనియును, పట్టణములోఁ జాలమంది యూదులున్నారనియును, వారిలోఁ బలువురిటలీప్రజలై యిటలీ దేశపు మసానికసంఘములకుఁ జెందినవారనియును, వారిటలీ ప్రజలగుటచే టర్కీచేఁ గావింపఁబడిన సమయ సమర్పణముచేతను నములులోనున్న సంధులవలనను సుల్తానువారిని నిర్బంధింపఁ జాలఁడనియును, సురతానుని పోలీసులు వారి గృహాములను సోదాచేయఁజాలరనియును వారిపై ధర్మానుసరణముగఁ జర్చయేమైనఁ గావింపవలెనన్న నిటలీరాష్ట్రప్రతినిధి న్యాయస్థానములోనే నట్టివి కావింపఁబడవలెననియు ముస్తఫా

కెమెలునకు చెప్పెను. ఫెతీ మున్నగు పెక్కురు సైనికాధికారులు కెమెలుతోఁగూడ మెసానికుసంఘములో సభ్యులుగఁ జేరి తత్కార్యకలాపవ్యాజముతో నైకమత్య ప్రవృద్ధిసంఘము నేర్పాటు చేసిరి. వారిమిషతోనే యూదుల గృహములలో సమావేశము గావించుచుఁ బుష్కలముగ ధనసాహాయ్యమును బొందుచుండిరి. రాజద్రోహులయి సురతానుచే దేశమునుండి వెడలఁగొట్టఁబడి పరదేశములలో వశించుచున్న టర్కులతో నుత్తరప్రత్యుత్తరములను గావించుచు వారి యుదంతములను దెలిసికొనుచు వారితో సంబంధము కలిపెను. ఇంతవరకు నైకమత్య ప్రవృద్ధి సంఘముయొక్క కార్యనిర్వాహక సంఘసభ్యులు కెమెలుయొక్క మంచిచెడ్డలు పరీక్షించుచుండిరి. ఫ్రీమేసను కాగనే తమ సంఘమందు సభ్యునిగా జేరమని వారాతనిం గోరిరి.

ముస్తఫా చేరిన మెసానికులాడ్జిపేరు వెడటా. వెడటా సభ్యులచర్య లాతని కిచ్చలేదు. ఈసంఘ మంతర్జాతీయ భావ శూన్యవాద సంఘములో జేరినది. అందలి సభ్యులన్ని జాతులకు జెందినవారై ముఖ్యముగా యూదులను బీడించుచున్న రష్యా దేశమును నిందించుటయు ధనమార్జించుటకు వీలైన వియన్నాపట్టణమును బొగడుటయుఁ గని ముస్తఫా వారి నసహ్యించుకొనుచుండెను. మఱియు నా సంఘసభ్యులు చోరులవలె సంచరించుచు నవీనములగు రహస్య కార్యముల నాచరించుచు సర్థముకాని విధమున మాటాడుచు నుండెడివారు.

# తృతీయ ప్రకరణము

ఈ మెసానికుసంఘములోఁ దెలియకఁ జేరుటచే ముస్తఫా యంతర్జాతీయ ధనాగపు రాజ్య పరివర్తనవిషయిక గుప్తసంస్థాపనయొక్క మాయావ గురములో జిక్కువడినట్లు గుర్తెరుంగ నారంభించెను. ఆతనికి నంతర్జాతీయ యాశయములపైని యూదుల దురవస్థలపైని నెంతమాత్రమభిమానములేదు. మెసానికుమతతంత్రము నాతఁడు నిగసనభావముతోఁ దిలకించుచుండెను. ఆతనికి మాతృభూమిపై ప్రేమ యధికము. టర్కీ దేశమందు జన్మించుటచే నాతఁడు మిగుల గర్వించుచుండె. ఆ దేశమును సురతానుని దుష్పరిపాలనము నుండియు నవివేక మహాపంకమునుండియు పరదేశీయుల పీడనములనుండియు సంరక్షించుట కాతఁడు బద్ధకంకణుఁడయ్యెను. ఇట్టి యుద్దేశములతోఁబాటు ముస్తఫా మెసానికుసంఘమునఁ జేరుటచే సంఘములోని పెద్దలయాజ్ఞ నెరవేర్పవలసివచ్చుచుండెను. ఇతరుల యాజ్ఞల ననుసరించుటయన్న నాతనికి నెంతమాత్రము రుచింపదు.

ఆ హేతువుచే నియమించిన కార్యముల నెరవేర్పక నిష్ఠురముగ సంఘాధికారుల యాజ్ఞల ఖండించుచుండెను. సహజముగ నాతఁడితరుల నాజ్ఞాపించు స్వభావము కలవాఁడు గాని యడకువతో నితరులయాజ్ఞల నెరవేర్చువాడుగాడు. ఎవ్వరివాదమయినను ఖండింపవలసివచ్చినచో మొగమాటమిసుమంతయును లేక ఖండించును. ఆసమయమందాతని నెవ్వరయిన నిరోధించిన కోపావేశపరవశుఁడై సంచరించును. ఐకమత్య ప్రవృద్ధి సంఘమాకస్మికముగా జన్మించి యనుపయుక్తమయిన

దనియు, సంఘసభ్యులువాక్చూరులుగాని కార్యశూరులుకారని యు పలుసారులు తెగడుచుపలుకుచుండును. సిద్ధాంతములకొరకు పాకులాడక సత్యవిషయముల చెప్పుడనియు గడు జాగరూకతతో ముందుగా నాలోచించి కార్యక్రమమును నడిపింపుడనియు నాతఁడుతీవ్రముగా వారితో జెప్పుచుండును. ఉత్సాహ మెంతయవసరమయినను మితిమీరినచో నది కార్యసాఫల్యమును గూర్పలేదని యాతని యుద్దేశము. సంఘసభ్యులన్న నాతనికి గౌరవమేమియులేకుండెను. ఎన్వరు సాహసికుఁడు అస మీక్ష్యకారియనియు, జెమలు యున్నమిత బాహువుఁడు శ్యామ వర్ణుఁడు కుటిలమనస్కుఁడనియు, సెలోనికా యూదుఁడయిన జావిదు తనమతమునకు విరుద్ధమగు నిస్లాము మతావలంబకుఁ డనియు నాల్బేనియా దేశస్థుఁడైన నైజీయున్మత్తుఁడు విచార శూన్యుఁడనియు గారిబాల్డీవంటివాఁడనియు, తపాలగుమాస్తాయగు టాలటురుక్షువలెనుండు మందగామియనియునెంచి ముస్తఫా యుపాధ్యాయుఁడు ఛాత్రులను జూచున ట్లీసంఘ నాయకుల నందరను జూచుచుండెను.

తోడియుద్యోగస్థుల నందరకు నాతనిపై నిష్టములేదు. ఆతఁడితరులు వాదమును ఖండించునపుడు పరసముగ నట్టిఖండ నముల గావింపక వెగటుగను తీక్ష్ణముగ గావించునని వారి కాతనిపైఁ గోపము. యూదుల కేతనిపై నమ్మకములేదు. వారు తమరహస్యముల నతనికిఁజెప్పక యాతనిం దూరముగా నుంచెడివారు.

# తృతీయ ప్రకరణము

ఒకనాఁడాతఁడు తన యింటికడ రాజద్రోహులగుమిత్రులతో మాటాడుచుండెను. సేవకులు వారిసంభాషణమును విని తనతల్లితోఁ జెప్పిరి. ఆమె తాళపుకన్నములోనుండి వారిసంభాషణమును మెల్లఁగవిని వారు వెళ్లిపోయినపిమ్మట నట్టిపనికూడదని ముస్తఫాను మందలించెను. ఆతఁడు నూతననైతిక సిద్ధాంతావలంబియై జననితో వాదింప నారంభించెను. వారిరువురును తీవ్రముగా వాదించిరికాని యామె చివరకు పుత్రవాత్సల్యముచేతను నాతఁడిల్లువిడిచి పారిపోవునను భయముచేతను ముస్తఫాకు లొంగిపోయి యాతనికి సాయముచేయ నంగీకరించెను. కాని సురతానుపై పన్నుగడలు పన్నుటయు మతమును ద్వేషించుటయు బాలిశ్యమనియెల్లపుడు నాతనిమందలించుచుండెను. కుటుంబసంబంధములు, బంధువులవంకకు వృథాలాపంబులు వాడువాండ్రసూక్ష్మనిరీక్షణంబులు సంచారములోనుండునిరోధములు నాతనికి బాధ కలుఁగఁజేయుచుండెను. సహనమాతని స్వభావములో లేదు. స్వాతంత్ర్యమున కెట్టినిరోధము కలిగినను నాతఁడు సహించఁడు. ఆహేతువుచే నాతఁడు తనతల్లి యింటను వసించుటమాని యద్దెకొక గృహమును దీసికొని యందు తనవాసము నేర్పాటుచేసికొనెను తరచుగా దనతల్లిని చూచుచు తల్లిదగ్గర తాను నివసింపకుండుటచే గావలయు నామెచేయు నుపదేశములం బెడచెవిని పెట్టక సహనముతో వినుచుండెను. పగలంతయు తనయుద్యోగ కార్యముల నత్యధిక శ్రద్ధతో నాచరించుచు రాజద్రోహులతోఁ గలసి సురతాను

నకు నవాతమాచరించు కార్యములఁగూర్చి పన్నుగడల పన్నుచునుండెను. ఆతఁడెంతకాల మాసంఘములోనున్నను నాయకులాతనినమ్మక తమరహస్యాలోచన సంఘములోనికి దీసుకొనక పోవుటచే దుతకాతఁడు వారినివిడచి యేకాంతవాసముచేయుచు మితభాషియైయుండెను.

---

౪

నయ్యాజీయు యను నతఁడు యున్మత్తునివలె సంచరించుచు యాలోచనలేక చేయవలసినకార్యముల గురించి యించుకయు నాలోచింపక అల్పపరివారపరివృతుండై రెస్ని యను పట్టణమును విడచి దక్షిణ మాసిడోనియా మండలములోనికి బోయి రాజాధికారమును ధిక్కరించెను. వెంటనే మాసిడోనియాదేశపు ప్రాగ్భాగములో ఎన్వెరను నాతఁడు రాజపరివర్తనము నుద్ఘోషించుచు నొకపత్రమును ప్రకటించెను. ఐకమత్య సంవర్ధకసంఘములో మూఁడువందలకు మించిన కార్యశూరులగు సభ్యులులేరు. ఈ ప్రజాప్రకోపన కార్యమును జయప్రదముగా నడపించుట కెట్టియేర్పాటులును జరుపబడలేదు. ఇట్టి యవసరములలో రాజ్యపరివర్తనకారులకు సైన్యములు సంపూర్ణసహాయముచేసినగాని జయము లభింపదు. సైన్యము లెట్లుచరించునో తెలియదు; యిట్టి పరిస్థితులలో ముస్తఫా మాత్రి మొట్టి సంపర్కమును తిరుగుబాటుదారులతో గలుగఁజేసికొనక తన విధులను నెరవేర్చుకొనుచుండెను.

దైవయోగముచే రాజ్యపరివర్తనకార్యము జయప్రదముగా జరిగెను. కొలదిమాసములలో జరిగిన యుదంతము వ్రాసిన ఆశ్చర్యజనకముగానుండును. కొన్నివందలమంది పితూరీదారులు కొండలబట్టి దిరుగుచుండ వారి నడంచుటకు రాజసైన్యముకొంతపోయెను. ఆసైన్యము కొంతకాలమునకు వారిలో కలసిపోయెను. సైనికులకు జీతములు క్రమముగా నియ్యకుండు

టచే వారికి సురతానుపై నమ్మకముపోయెను. ఏ సేనాదళమును బంపినను నవి తిరుగుబాటుదారులతో గలియుచుండెను. టర్కీ రాజ్య మధ్యభాగమునందు నున్నవారికి రాజాభిమానము మిక్కుటముగా నుండునని యోచించి తిరుగుబాటుదారులను నిర్మూలనము గావింపగలరను నాశతో సురతాను ప్రబలమయిన సైన్యమును ద్రోహులున్న ప్రాంతముల కంపిరి. కాని వారును రాజద్రోహులతో గలసిపోయిరి. అత్యాశ్చర్యజనకమగునటులు రవ్వంత గాలివీచినను పండుటాకులు భూమిపై వ్రాలునటుల సురతాను నాధిపత్యము నధికారము బలము జారిపోయెను. ఐకమత్య సంవర్ధక సంఘములోని యువకులింతసులభముగా తమకు జయముగలుగునని కలలో నైన నూహించి యుండలేదు.

పిమ్మట సురతాను యిస్తాంబూలను ప్రదేశములో పరదువలె గాచుకొనియుండి జరిగిన కష్టములకు ననాచారములకు తనమంత్రులే కారకులని నిశ్చయించి రాజ్యపరివర్తన కారులను నభినందించి చారసర్గమును పనులనుండి తప్పించి వ్యవస్థానురూపమయిన ప్రభుత్వము స్థాపింపబడెనని ప్రకటించెను. నయ్యూజి అన్వరులకు టర్కులు క్రీస్తుమతావలంబకులుగూడ నత్యుత్సాహముతో దేశోద్ధారకులని స్వాగత మొసంగిరి. సంఘములోని తదితర సభ్యులు ముస్తఫాతోగూడ సెలోనికా పట్టణములో కలిసికొని వారిని గౌరవించిరి. ఒలింపసుప్యాలసు హోటల్ వరండానుండి ఎన్వరు నూతన వ్యవస్థానరూపమయిన

పరిపాలనావిధానమును ప్రకటించెను ప్రజలయొక్క జయ జయధ్వనులు మిన్నుముట్టెను. మన ముస్తఫా కెమలు సంఘ సభ్యులలో పేరుప్రతిష్ఠలు లేక ఎన్వరు వెనుక నిలువబడియుండెను. అబ్దుల్ హామీద్ చే ఇరువదివత్సరములనుండియు దేశబహిష్కృతులుగాబడిన నజీరుపదభ్రష్టులు రాచబిడ్డలు మంత్రులు మున్నగువారు కాన్స్టాంటినోపిలు పట్టణముఁజేరి యువకులగు సంఘసభ్యుల నాకమూలకు నెట్టి యధికారమునకై కపట ప్రబంధముల చేయ నారంభించిరి. అన్వరును రాజదూతవర్గములో సైనికోద్యోగిగా నియమించి బెర్లినుపట్టణమునకు బంపెను. ట్రిపోలిలోనున్న టర్కీ సేనల పరిస్థితులగూర్చి వ్రాసి వేదికనంపుటకు కెమలును ఉత్తరాఫ్రికా ఖండమునకంపిరి. నియాజి యాల్బేనియాకు దిరిగివచ్చినతోడనే యాతని నటసంహరించిరట. ఇంతలో ఆస్ట్రియా ప్రభుత్వము బోస్నియా హెర్జెగోవినాయను మండలముల నాక్రమించెను. గ్రీకు ప్రభుత్వము క్రీటు నాక్రమించెను. రష్యా సాహాయ్యముతో బల్గేరియా స్వాతంత్ర్యము ప్రకటించెను. ఆల్బేనియా దేశ ప్రజలును నరాబియా దేశపు ప్రజలును తిరుగుబాటు చేసిరి. క్రైస్తవులు మహమ్మదీయులు, పరస్పరము సంహారము గావించుకొన నారంభించిరి. దేశమందు సంక్షోభము మితిమీరెను. ఇట్టి సమయములో సురతాన్పై నభిమానముగలవారు కూడ తంత్రముల బన్న నారంభించిరి. కాన్స్టాంటినోపిలులో నున్న సైనికులకు ధనదానముచేసుకొని లోబరచుకొనిరి. పేరిసు మున్నగు దుష్టపట్టణములలో ప్రచారములోనున్న

యాశయములచే ప్రోత్సహింపబడి సంఘసభ్యులు నాస్తికులనియు, ఇస్లాము మతద్రోహులనియు కేలిఫేటును నాశముసేయుటకు నిశ్చయించుకొనిరనియు వారు యూదులుఫ్రీమేసనులనగుదురుగాని మహమ్మదీయులు, టర్కీలు నెంతమాత్రము కారని పురోహితులమూలమున వాఙ్మూలమునను ప్రజలలో తీవ్రప్రచారము గావింప నారంభించిరి. ఇట్టి ప్రబోధములచే కానిస్టాంటునోపిలులోనున్న సైనికులు మతావేశపారవశ్యముచే తీవ్రకోపులై విజృంభించి సురతానునకు నిస్లామునకును, నిస్లాము మతావలంబకుడగు కాలిఫునకును తమ యభిమానము వెల్లడించుచు సైనికోద్యోగుల దునుమాడి సంఘసభ్యుల బారద్రోలిరి. ఆ సంఘసభ్యులు మెసిడోనియాలోనున్న సైనికుల సాయమునుపొంది, తత్సైనిక సాహాయ్యములేనియెడ మునుపటివలె నబ్దుల్ హమీదును వాని యనుచరులు మరలయధికారము స్వీకరించి దేశమును పూర్వపు దుస్థితికి తేగలరని ప్రజలలో భీతిలేకపోలేదు.

మహమ్మదు షెవుకెటుపాషా యనునాతడు మెసిడోనియా సేనలకు నాయకుడు. ఆతడు పొడగైనవాడును కొజ్జావలె శవసవర్ణమయిన దృష్టికలవాడును, క్షీణదేహుడునైయుండియు యుద్ధతంత్రములందు కడునేర్పరియయ్యు మనస్సంప్రదారణముచే తొందరగా బనులుచేయజాలనివాడై యుండెను. ఆసమయములో నాతడేమిచేయుటకు తోచక కింకర్తవ్యతామూఢుడై యుండెను. సంఘసభ్యులు మాత్రమతికష్టముతో నాతనిం దమ

వైపు దిప్పుకొనిరి. మాసిడోనియాలోనుండెడి రెండుమూడు సైన్యదళముల నాతఁడు కాన్‌స్టాంటినోపిలుమీది కంపెను. ఎన్వరు దేశములో జరిగిన యీయుదంతములనెల్ల తెలిసికొన గనే బెర్లినుపట్టణమును విడచి, మేసిడోనియా జేరెను. అచట నుండి మొదటి బయలుదేరిన సైనికదళములో నాశ్వికదళ నాయకుఁడయ్యెను. ముస్తఫా సహాయాధికారి వర్గములో ముఖ్యుఁడైయుండెను. వారు రాజ్యపరివర్తన కార్యవిరోధిపక్ష మును విదళీకరించుచు సెలోనికాలో విల్లా అల్లటినిప్రాసాద ములో అబ్దుల్ హమీదును బంధించి మేసిడోనియను దేశస్థుఁ డయిన ఫెరీనికారాగారాధికారిగా నియమించి సింహాసనముపై హమీదుయొక్క సన్నిహితజ్ఞాతి నధిష్ఠింపఁజేసి స్వసంఘము నకు బలమునుచేకూర్చెను. సంఘసభ్యులలో నెన్వరు జనరంజ కుఁడై ప్రభుమన్ననలకు బాత్రుఁడయ్యెను. ఆతఁడు ప్రభా శాలి యోజస్వి సాహసి; స్వతసిద్ధముగా ప్రసిద్ధిసంపాదనలో శక్తియుక్తుఁడు; వాని నగ్రస్థానమునలంకరింపఁజేసినవీగుణములె ముస్తఫామాత్రముదుర్దాంతుఁడైకరాళరూపయుక్తుఁడునప్రమ త్తుఁడువిమృశ్యకారియునైయుండుటచేలోకప్రసిద్ధినొందకుండెను ఎవ్వరిని లక్ష్యపెట్టక మిత్రరహితుఁడై యేకాకియైసంచరించుచు నందరియెడను గుణదోషవివేచనము చేయుచు నెవ్వరి సలహా లను నాదరింపకుండుటచే నాతనిని వెనుకకుఁబారద్రోలి సాంగ్రా మిక వృత్తిలోనికి బంపివేసిరి.

నైసర్గికముగా ముస్తఫా యోధుడు. తనవిధుల నతి శ్రద్ధతో నిర్వర్తించుకొనుచు సైనికాధికారుల యశ్వారోహణోపన్యాస శిక్షణకార్యములం జక్కగా నేర్పరిచి నెపోలియను మార్ల్బ్రో మున్నగువారి యుద్ధచరిత్రలను లెస్సగా బరిశీలించుచుండెను. అతినూతనోత్సాహములకును శీఘ్రశ్రేష్ఠపదావాప్తికిని దగిన కాలమది. ముప్పదివత్సరములు ప్రాయమువచ్చు నప్పటి కాతడు మేసిడోనియాలోని మూడవ సైన్యమునకు ముఖ్యాధికారియయ్యెను.

అలీరిజాయను సేనానితోగలసి యధికారి వర్గములో నొకడుగా జేరి క్రీస్తుశకము 1910లో ముస్తఫా ఫరాసు దేశమునకు వెళ్లెను. పికార్డిలో జరిగిన వరాసులసాంవత్సరిక మిథ్యాయుద్ధ వ్యపదేశములందు పాల్గొని బుద్ధికౌశలమునకును శక్తిసామర్థ్యములకును నాలీరిజా మన్ననలకు పాత్రుడై దేశమునకు దిరిగివచ్చిసిపిమ్మట సెలోనికాలో సైనికోద్యోగుల కొరకు స్థాపింపబడిన పాఠశాల కధ్యక్షుడుగా నియమింపబడెను. ఆపాఠశాలను మిక్కిలి వైదగ్ధ్యముతో పునర్నిర్మాణము గావించెను; గాని యీపనిలో నాతనికంత యిష్టము లేకుండెను. రాజకీయ వ్యవహారములలో పాల్గొనవలయునను కుతూహల మాతనికెంతయున్నను నవకాశముమాత్రమేమియు లేకుండెను. ఎన్వరు, టాలటు, జమలు మున్నగువారు ఆకాలములో పాలనను నడపించుచుండెడివారు. యూదమతమునువిడనాడి మహమ్మదీయమతము నవలంబించిన జావిదు రాజస్వాధి

కారియమ్యెను. ఆయినను మన ముస్తఫా కెమలువారల్పులనియు పరిపాలనము చేయుటకుదగినవారు కారనియు వారిని నిర సించుచుండెను.

పాఠశాలలోను, వెలుపలను కెమలుతనయుద్దేశములను ప్రకటించుచుండెను. క్రైస్తవ ప్రభుత్వములు దురాశా దూషితములైయున్నవనియు, పార్మనీప్రభుత్వము టర్కీకంఠము బట్టి నొక్కుచున్నదనియు పార్మనీదేశములోని కోటీశ్వరులు టర్కీదేశములోని వివిధములగు ధనసంపాదన విషయస్వత్వము లను సంపాదించిరనియు, జావిదు రాజద్రోహియై బాగ్దాదు రైలుమార్గపు టధికారమును విక్రయించుటచే వారు దానిం బరిగ్రహించిరనియును, పార్మనీదేశములోని నివుణులగు దూతలు కానుస్టాంటునోపిలులోనే పార్మనీదేశపు మేలునకు పాటు బడుచున్నారనియు పరదేశీయులకు నందుముఖ్యముగా పార్మనీదేశీయులకు టర్కీదేశము దుర్మార్గులగు పరిపాలకులచే విక్రయింపబడుచున్నదనియు, టర్కీదేశములోని పరిస్థితులు రాజ్యపరివర్తనము జరుగుటకు ముందుటివలె కడు శోచనీయ ములై యున్నవనియు అబ్దుల్ హమీదుకాలములో వలెనే యిప్పుడుగూడ యుద్యోగివేతన ప్రదానవిరామము పరి పాలనావిధానములును సాధారణపరిస్థితులును యభద్రములై యున్నవనియు సైనికులలో యసంతృప్తి ప్రబలియున్నదనియు యుక్తమయిన యేర్పాటులు తక్షణమేగావింపనవసరమైయున్న దనియు నాతడుద్ఘోషించుచుండెను.

ముస్తఫా యిపుడున్నతపదవి నలంకరించుచుండెను. ఈతఁడు కార్యదక్షుఁడనియును బహుకౌశల్యము కలవాఁడని యును తగవరు లనుకొననారంభించుచుండెడివారు. సైనికాధికారులలో నసంతృప్తి ప్రబలముగావ్యాపించి యెట్టి సాహస కృత్యములకైనను సంసిద్ధులై యుండెడివారు. అట్టివారందరు కెమలు ప్రచారమునకు చెవియొగ్గుచు వానిం బరివేష్టింపనారంభించిరి. ఇదివరలోనుండినట్లు నిరసనభావము చూపుటమాని యట్టివారితో మంచిమాటలు చెప్పుచు వారుచూపించు గౌరవముచే సంప్రీతుఁడగుచు నొక నూతనప్రవృత్తినాయకుఁడై యుండెను.

కెమలుచేయు చేష్టలన్నియు కానిస్టాంటినోపిలులోని సాంగ్రామిక శాఖామంత్రికిఁ దెలిసెను. బాల్కను మండలములుప్రభుత్వమునకు నాపత్సంపాదకములని యాతఁడు గుర్తించుటనే కెమలు నటనుండి స్థానాంతరము పంపించుటకు నిశ్చయించి ముప్పదియొకటవ కోల్పుల దళమునకు నాయకునిగా నేర్పరచి సెలోనికాలో నాతని యుంచెను. మంత్రియగు మహమ్మదు షెవుకెటుపాషా ముస్తఫా కార్యదక్షతను బాగుగా గుర్తించియుండెను. ముస్తఫాయును తనవిధుల నెన్నగా నిర్వర్తించుకొని తోడివారి గౌరవాభినందనములకు పాత్రుఁడగుచుండెను. సైనికోద్యోగులాతని చుట్టును జేరనారంభించిరి. త్వరగా రాజ్యపరివర్తనముచేయు నుద్దేశముతో

నాతఁడు రహస్యముగా నేర్పాటులు చేయ నారంభించెను. పర దేశీయులను దేశమునుండి వెడలఁగొట్టి తద్దేశపరిపాలనము దక్షతతో నడపించుట యాతని ముఖ్యాశయము. టర్కీదేశము టర్కీలదేయని యాతఁడు సింహనాదము గావించుచుండెను. చారులీతని చర్యలను ప్రభుత్వమునకుఁ దెలియఁ జేయగా ప్రభుత్వసంఘసభ్యు లీతనిదండింపవలయునని పట్టుపట్టిరి. తదనుసారముగా షెవుకెటుపాషా యాతనిఁ బిలపించి సైనికులుప్రభుత్వముపై దిరుగుబాటు సేయునటులు ప్రేరేపించుచున్నాఁడను నింద నాతనిపై మోపగా నాతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. కాని యీ యుత్తరములు మంత్రికి సమ్మతికలుగఁజేయలేదు. అయినను ముస్తఫాను చెరసాలలోనుంచుటకుఁ దగిన సాక్ష్యమేమియు లేక పోవుటచే అతనిని సైనికదళపదవినుండి దొలగించి కానిస్టాంటునోపిలులోనున్న యుద్ధకార్యశాఖకు రప్పించెను. కెమెలు భీతియనునది యెరుగఁడు. బిభీషకులను సరకుఁగొనఁడు. తమ సమక్షములోనున్నచో నాతఁడు జాగరూకతతో సంచరించునను సమ్మానకముతో నధికారులాతనిం దమయొద్దనే యుంచుకొనిరి.

కానిస్టాంటునోపిలులో సైతము సంక్షోభ మెక్కువగనే యుండెను. రాజనీతినిపుణులు యధికారములకొరకై తంత్రములఁబనుచుండిరి. ప్రతిపక్షమువారను మంత్రివర్గములు మారుచునేయుండెను. రాజనీతినిపుణులలో చాతుర్యముతో వ్యవహారములు నడపించుటకు దక్షుఁడైనవాఁ డగపడలేదు. షెవు

కటుపాషామాత్రము సర్వతోముఖ కార్యదక్షుడై యుండినను యాతడు మంత్రివర్గము గూర్చుకొని పరిపాలనము నడపించుటకు యీయకొనలేదు. జార్మనీయుల ద్వేషించు వారికెట్టి సంబంధమును బరిపాలనములో లేకుండజేయు నుద్దేశముతో నొకకక్షయేర్పరచెను. సైనికోపాధ్యాయులుగానున్న జార్మనీయులన్నను, జార్మనీ దేశపురాయబారియైన వాన్‌వాంఘెన్‌హీము యన్నను యీపక్షమువారికి కడుపుమంట. వాన్‌వాంఘెన్‌హీము, మహాకాయుడు, క్రూరుడు, నక్కజిత్తులమారి, కుశాగ్రబుద్ధియుక్తుడు. ఎన్వరునకు మిత్రుడు. ఈతడు టర్కీప్రభుత్వమును జార్మనీదేశ ప్రభుత్వముచేతిలోని కీలుబొమ్మగాజేయ సర్వప్రయత్నములు జరుపుచుండెను.

ఈపక్షమువారు స్నేహభావమును గనపరచుచుండుటచే వారాతని స్నేహమునుగోరి తమపక్షములోనికి దీసికొందురను నాశ కొలదికాలమువరకు నాతని బాధించుటచే నాతడు సామాన్యరాజకార్య నిపుణుల గృహప్రాంగణముల యందు కాలముగడుపుట కారంభించెను. మాటలాడ నారంభించినచో మితము మేరయులేక యాతడు మాటలాడుచుండును; మాటలాడుటమానినచో గంటలకొలదీ మూకీభావ మవలంబించి యూరకొనుచుండును. ఒకప్పుడు అసభ్యునివలె వారలతో సంచరించుచుండెను. కాన్‌స్టాంటునోపిలులో నాతడీకార్యవాదుల కెంతమాత్రమునుపయోగింపకుండెను. తత్కారణమున వారాతనిం

దూరముగానుంచిరి. కాని యుద్ధకుశలుండుగూడ నగుటచేఁ గొంచెము కొంచెముగాఁ వారాతనిఁ జేరఁదీయుచుండిరి.

రాజ్యపరిస్థితులిట్లుండగ క్రీ.శ. 1911. అక్టోబరులలో నెట్టిసూచనయులేకుండగనె నిటలీ ప్రభుత్వమువారుత్తరాఫ్రికా ఖండములోనున్న ట్రిపోలి ప్రాంతములకు ప్రాస్థానిక సైన్యము నంపి ట్రిపోలీపట్టణమును పరిసరస్థసాగరప్రాంతమును నాక్రమించుకొనిరి.

కెమెలు మహాయోధుడు. యుద్ధముసేయుట నాతనివృత్తి. యుద్ధమన్న నాతనికి పరమప్రీతి. ఇటలీసేనలు ట్రిపోలీని పట్టుకొనగ ముస్తఫా యచటపోయియుద్ధములో పాల్గొనుటకు ప్రయత్నమునలిపెను. ఎన్వరు యప్పటికే యుద్ధభూమికి పోయియుండెను. ఫెరీవేసునుండి చేపలుపట్టువాని యొక్క చిన్న తెప్పలో నెక్కి సముద్రమునుదాటి ట్యూనిసునగరమునకువచ్చెను. సిరియా యీజిప్తుదేశముల మూలముగా భూమార్గముల ననుసరించిననేదప్ప వేరొకవిధమున ట్రిపోలీకి సేనలనంపుటకు టర్కీకవకాశములేదు. ఇటలీదేశస్థులు మధ్యధరాసముద్రములో నుండి టర్కీల యోడలురాకుండఁజేయు నధికారము గలిగియుండిరి. మఱియు, టర్కీప్రభుత్వమునకు రెండే యుద్ధనావలుండెను. ఆనావలలోనుండు యంత్రసామగ్రి తుప్పుపట్టెను. నావికాదళములు మాయమయ్యెను. ఆకారణముచే కెమాలిరువురు స్నేహితులతో భూమార్గము ననుసరించి యాల్పాశయ ద్వారముగ సిరియా పేలిస్టీన్ దేశములలోనుండి రైలుమార్గమున్న ప్రదే

# చతుర్థ ప్రకరణము

ఎయిన్-అల్-మాన్సూరు యనుపట్టణము డెర్నా యను రేవుపట్టణమునుండి పదునేను మయిళ్ల దూరమున నున్నది. అదియే టర్కీ సేనలకు ముఖ్యకార్యస్థానము. ఆపట్టణము చేరగనే తగినంతమంది నాయకులు లేకుండుటచే నచటి వారాతనికి స్వాగతమొసంగిరి. డెర్నా కెదురుగానున్న భాగములోనున్న సేనలపై నధికారిగా నీతఁడు నియమింపబడెను. ఎన్వారునకు యుద్ధము సేయుచున్న యన్ని సేనలపైగూడ నధికారము మొసంగబడెను. ఆయిరువురి నివాసములు యాన్. అల్. మాన్సూరిలోనే యుండెను. కెమెలు మేజరుపదవి నలంకరించెను.

నావికాదళముల రక్షణముండుటచే నిటాలియనుల సైన్యములు రేవుపట్టణముల నాక్రమింపగలిగెను: కాని దేశము లోనికి ప్రవేశింపలేకపోయెను. వారికడ్డముగ టర్కీ సైన్యములు యుద్ధసన్నద్ధములై నిలిచియుండెను. టర్కీల వెనుక నుత్తర ఆఫ్రికాఖండము నంతటిలోనున్న వివిధజాతులకుఁ జెందిన మహమ్మదీయులందరును పురోహితులచే ప్రేరేపింపబడి జేహాడ్‌ను (మహమ్మదీయ ధర్మసంరక్షణకొరకగు యుద్ధముఁ ప్రకటించిరి. సహారామరుభూమిలో దక్షిణముననున్న లిబియా దేశము, కుఫ్రియను శాద్వలస్థలము మున్నగువానినుండిగూడ లెక్కకుమీరినంతమంది వివిధజాతులకుఁ జెందిన మహమ్మదీయులు తమమతమును కాపాడుకొనుటకై తండోపతండములుగ సంగ్రామప్రదేశములనుఁజేరిరి. మతోద్రేకముతో నుజ్వ

లులగుచు నుత్తరాఫ్రికా దేశీయులగుమహమ్మదీయులు కలిఫా ప్రతినిధియగు నెన్వారును దర్శింపవచ్చిరి.

సెనుస్సి జాతివారి షేకు (అధిపతి) తనయోధులనంపెను. తూఆరెగు, హాస్సిని జాతివారి యోధులును నచటఁజేరిరి. ఎన్వారు ఘనమైన యొకదూష్యమును రచియించి యందు షేకులతోను, ప్రచండయోధులతోను, సంభాషించుచు, వారిని ధనవాదముచే సంప్రీతమనస్కులుగఁ జేయుచుండెను. నలువదిమంది యోధుల నొకగణముగా నేర్పరిచి యాగణమును ముగ్గురు టర్కీయుల యధికారమున నుంచెను. యీయోధులకు వంటకములఁ దయారుచేయుట కొక్కయాఁడుదాని నేర్పరిచెను. ఆయోధులకు పారితోషికములనిచ్చియు యుద్ధములో మడిసిన వారి కుటుంబమునకు పుష్కలముగ ధనమొసంగియు వారికి భోజనసదుపాయముల లెస్సగా నాచరించియు నెన్వరు వారిని సంప్రీతమనస్కులుగాఁజేసి వారిసాయముతో నిటలీ సేనలు ముందంజవేయకుండ నరికట్టియుంచెను.

ముస్తఫా పైయధికారియగుటచే నెన్వరునకు లోబడి యుండవలసివచ్చెను. వారిరువురును దృఢమనస్కులుగర్విష్టులు ప్రతికూలాసహిష్ణులు నిర్భయులునైయుండిరి. మహదాశయములచే నుద్దిష్టుఁడై ఎన్వరు మనసంకల్పులగ్న మనస్కుఁడై సవిస్తరముగ నెట్టివిషయమునైన పరిశీలించుట కోపిక లేకయుండెను. అనిశ్చితాశయములన్న ముస్తఫా కనుమానమెక్కువ. శక్తికిమించిన యభీష్టార్థముల నాతఁడెన్నఁడును మనసున జొర

నీకసవిస్తరముగ విషయమునంతటిని పరిశీలించినగాని యాతఁడు దేనిని చేయఁబూనుకొనకయుండెను. తలపెట్టిన యెట్టివిషయములోనైనను దానిప్రకృతి దెలిసికొనకుండ నాచరణయందు బెట్టకుండెను. టర్కులన్న నాతనికి గౌరవము తదితరజాతుల యందరి యందును నాతనికి నిరసనభావమే.

మొదటినుండియు ఎన్వరునుజూచిన కెమెలునకిష్టము లేదు. ఇప్పుడుగూడ నాతనివిషయమున నిరసనభావము గలిగి యున్నిసమయములందు నాభావము ప్రకటముగ గనపరచుచుండెను. ఈవైరిశ్యమునకు దోడెన్వరుపై నసూయయుజనించెను. ఎన్వరుకంటె తానే ప్రజ్ఞగల సేనానియైనప్పటికి నెల్లప్పుడును వానికంటె తక్కువపదవిలోనున్నందుకు కెమెలునకు కడుపు మంటగా నుండెడిది. ఉత్సాహపూరితుఁడు విశ్రాంతుఁడు దానశీలుఁడు ఓజశ్శాలియునైయున్న ఎన్వరునకు ధూసర ముఖుఁడు కరాళరూపయుక్తుఁడు నిందాశీలుఁడునగు కెమెలు దర్శనము శుభకార్యము సేయుసమయములో గొల్లవాఁడెదురు పడినట్లయ్యెను. ప్రతియుపాయము ఖండించుచు సైనికుల నిరుత్సాహులుగ నొనర్చుచుండెను. ఎన్వరునొక్క యుత్సాహము నెతఖండించిన నాతని యధికారమునుమాత్రము ధిక్కరించుటలేదు. తపనునిబాధ విస్తారముగాను డు నా యెడారిలో నొక సంవత్సరము పాటు పెద్దయుద్ధమేమియు చేయక యప్పుడప్పుడు దాడులు సేయుచు రాళ్లగుట్టల చాటునపొంచుండి శత్రువులపై తుపాకులఁ బేల్చి పగించు నండ రెండుపక్షముల వారికి

నెట్టిలాభమును గలుగకుండెను. ఇంతలో సహజవైరముగల ఎన్వెరు కెమలులు కలహించిరి. ముస్తఫా తన చిన్నగుహార మును విడువక సైనికులవలె కష్టజీవనమును గడుపుచు నెన్వెరు సుందరదూష్యములోనికి వెళ్లుటమానెను. సౌమ్యుడగు ఫెరీ వారిరువురను సౌఖ్యపరుప ప్రియత్నించెను గాని యాతని ప్రయత్నము వ్యర్థమయ్యెను.

ఇదియిట్లుండగ బాల్కను క్రైస్తవరాజ్యము లన్నియు నొకచోఁజేరి యొక్కమారుగమాంటినీగ్రోటర్కీపై యుద్ధము ప్రకటింపటర్కీరాజ్యముపైదాడివెడలినవి.టర్కీమిక్కిలివేగముగ నిటలీ ప్రభుత్వముతో సంధిగావించుకొని మైగుప్తదేశమునకు టర్కీసేనలనుదీసికొనిపోయి మైగుప్తదేశపుస్వాతంత్ర్యమును ప్రకటించుమనియు టర్కీసాంగ్రామికోద్యోగులను మాతృభూమికిబంపమనియు ట్రిపోలీలోనున్న సేనాధ్యక్షుని టర్కీప్రభువులు యాజ్ఞాపించిరి. శత్రువులువిజృంభించి మర్మస్థానమును బట్టుకొనుటకు సిద్ధముగానుంట టర్కీదేశవినాశము సంభవించిన దాయను దేశభక్తులకు విషాదము భీతియు గలుగుచుండెను.

ముస్తఫా తనయధీనములోనున్న సేనలను ప్రభుత్వముచే నియమింపఁబడిన నాయకునకొప్పజెప్పి ఫరాంను ఆస్ట్రియా రుమేనియాదేశముల మూలముగా బ్రియాణపు టాటంకములను బెక్కింటిని తప్పించుకొని డిసెంబరు మాసములో కాని స్టాంటునోపిలుచేరెను. అన్ని యుద్ధరంగములలోనూ టర్కీ వారిసేనలు యుపజయముగాంచెను. ఉత్తరము నుండి నిరాటంక

ముగా సెర్వియా దేశపు సేనలు ప్రయాణముసాగించుచుండెను. గ్రీకు దేశపు సేనలు దక్షిణమునుండి దాడివెడలి సెలోనికా పట్టణమును నిరువదియైదువేల బందీలతోగూడ పట్టుకొనెను. బల్గేరియా దేశపు సేనలు కాన్‌స్టాంటినోపిలుపై దాడివెడలి యాపట్టణమునకు పదునైదుమైళ్ళదూరములోనున్న చెటల్జా యొక్క దృఢములైన మార్గములనుప్రవేశించి యాచటియాకందకములదాటుటకు సిద్ధముగానుండెను. రాజధానియున్న యీస్వల్పప్రదేశము నుండియు బల్గేరియా సైనికులచే ముట్టడింపబడిన ఆడ్రియానోపిలు దుర్గమునుండియు దప్ప యూరోపుఖండములోనుండిన తదితర దేశములలోనుండి టర్కీలు తరిమివేయబడిరి.

ఇట్టిదురవస్థలోనూ నౌకావిజయము మాత్రము ముత్సాహముగలుగఁజేయుచుండెను. రాఫ్ వి ఆదర నాయకుఁడు పిన్నవయస్కుఁడయ్యు హామిడెయా అను శిథిలావస్థలోనున్న యుద్ధనావపై డార్డనెల్సు సంధియొద్దనున్న యుద్ధమునుదాటి ఏజియను సముద్రములో శత్రువులనుండి రక్షించుకొనుచు రేవుస్థలములపై శతఘ్నిగోళములుగురిపించి దగ్ధమొనర్చుచు శత్రుసైన్యము కలఁగించుచుండెను. కాని యీతని యద్భుతచర్యలు యుద్ధనిర్వహణములపై నెట్టిఫలమును కనుపరుపలేకపోయినవి.

కాన్‌స్టాంటినోపిలు క్షతగాత్రులతో నిండియుండెను. ఆసుపత్రులేగాక క్రైస్తవ మహమ్మదీయ దేవాలయములు పురజనుల గృహములు క్షతగాత్రులతో నిండియుండెను. ఆ

పరిసమాప్తి జెందెను. ఇంతలో ఘనవిభుత్వములు సంధిసే యుటకై యుద్ధము సాగించుచున్న వారినందరిను సమావేశ పఱుప నారంభించెను. బాల్కనురాజ్యములన్నియు కాన్స్టాం టునోపిలుతప్ప యూరోపుఖండములోనున్న టర్కీదేశభాగముల నిచ్చివేయుమని కోరెను. బల్గేరియనలు ఆడ్రియనోపిలు నిచ్చి వేయుమని కోరిరి. టర్కీలలోను రెండుపక్షము లేర్పడెను.

జరాపీడితులయిన వజీరులలో ముఖ్యుడైన కెమిలు పాషాయును అతనిపక్షము వారునుగూడ దేశమున కెంతదైన్య మావహించినను సంధిచేసికొనకతప్పదని పట్టుబట్టుకొని యుండిరి. అల్పసైనికోద్యోగులందఱును వినాశము సంభవించినను శత్రువులను శరణువేడకూడదను దృఢసంకల్పముతో నుండిరి. ఇట్టి పరిస్థితులలో సైనికదళము అధికారుల ధిక్క రించుటయు రాచకార్యములం జక్కబెట్టువారు కపటకుతంత్రములం బన్నుటయు, దేశములో తీవ్రమగు సంక్షోభము సంభవించు టకుం గారణమయ్యెను. ఇట్టిసమయములో నెన్వరు ట్రిపోలి నుండి తిరిగివచ్చి ఐక్యమత్య సంవర్ధక సంఘమునందలి కార్యనిర్వాహకవర్గ సమావేశము గావించి యల్పసైనికోద్యో గులవెంట దీసికొని సభాభవనమునకుం బోయి యచట సమా త్యుల మంత్రిసభ జరుగుచుండగా నందులోం బ్రవేశించి సభను జూచిన నుద్యుక్తుండైయున్న సాంగ్రామిక శాఖాధికారిని క్షిప్రముగ వధియించి పిస్తోలుపట్టుకొని ముఖ్యవజీరును తదితర

నా సమావేశమున నిశ్చయింపఁబడెను. ఇదిశత్రుప్ర్యావర్తనము గావించుటచే ఫళ్ జాను వదలి యాడ్రియనోపిలు సంరక్షణకై శత్రుసైన్యములు పోవునటులు చేయును. అదివిని కెమాలీతంత్రము ప్రయోగముల నవకాశము కానిదని నొక్కిచెప్పెను. ఇట్లు తాని ఖండనము గావించుటకు కారణముల నీక్రింది విధముగా నుడివెను.

1. షార్కై దగ్గరనున్న కొండలు బల్గేరియను సైనికుల యధీనములోనుండుటచే నచట టర్కీలు పోతావరోహణము గావించుటకు వీలులేదు.

2 జుహైనుల్లో నున్న టర్కీసైన్యములు బల్గేరియను సేనలను వెనుకకు దరుమలేవు. ఒకవ్వేళ వారు బల్గేరియనులను తరుముగలిగినను సంశ్లేషము వారి స్వాధీనములో నుండియుండుటచే శత్రువులు తమకంటె తక్కువగాని సంఖ్యగల సేనలనచటకు పనుపఁగలరు. ఎన్వరుకుతంత్రము పైకి సమముగా నగపడినను నావధానముగాఁ బరిశీలించినప్పుడది ప్రయోగార్హము కాదని కెమాలు దృఢముగా నిశ్చయించి చెప్పుటచే నెన్వరు కోపావేశపరవశుఁడై తనయాజ్ఞలను నెరవేర్చుటయె కెమాలు పనియని నిష్ఠురముగాఁ బలికెను. ఎన్వరు తంత్రము చొప్పున నేర్పాటులుగావించిరి. ఫిబ్రవరి 8వ తేదీ యుదయము జులేరు సేవలలో రెండువర్గములు బల్గేరియనుల నెదుర్కొనుటకు బయలువెడలెను. కొన్నిమైళ్ళు వెళ్లిన తరువాత వారికి మార్గావరోధము కల్గెను. బల్గేరియను సేనలెడమవైపు నుండి

మెల్లగా జేరి వారిపై శతఘ్నీవర్షము గురిపించ నారెండుదళము లలో నొకటి చెల్లాచెదరాయెను. రెండవదళములోని ముఖ్యాధికారి కెమెలు ఆ దళములోనే బదుకున్న సైనికులు ప్రాణముల గోల్పోవ మిగిలినవారు వారిస్థానములన్ జేరిరి. షాంగెలోఁ బడవనెక్క యత్నించుచు నదియందు సైనికదళములో నారువేల సైనికులను నష్టపోయి మిగిలినవారు పోతావరోహణముచేసి తప్పించుకొని పారిపోయిరి. ఈయుద్ధతంత్రి మిట్లు టర్కీలకు హానికరమయ్యెను. ఇది జరిగిన మాసములోపల నాడ్రియనోపిలు శత్రువుల కధీనమయ్యెను. ఎన్వరు నడిపించుచున్న ప్రభుత్వము కెమలుపాషాచే నంగీకరింపబడిన సంధి నేయంగీకరించి సంధిపత్రములో సంతకముచేసెను.

ఈయుద్ధానంతరమున కెమలు కాన్స్టాంటు నోపిలును చేరెను. ఇంతలో నీయుద్ధమును గావించుచున్న టర్కీవారిలో నంతఃకలహము బుద్భవిల్లెను. టర్కీ దేశములో జయింపఁబడిన దేశభాగమును పంచుకొనుటలో వారిలోవారు కొట్లాటలను ప్రారంభించిరి. బల్గేరియనులు సూచనలేకుండగనే సెర్వియా గ్రీసు దేశము నెదుర్కొనెను. ఆరెండుదేశముల సైన్యములు గలిసి బల్గేరియను సేనలనోడించి తఱిమివేసినవి. ఇదియే మంచి సమయమనుకొని ఎన్వరు వీలయినంతమంది సైనికులఁ బోగుచేసుకొని మిగిలియున్న బల్గేరియను సైనికుల ద్రోలిపుచ్చి యాడ్రియనోపిలుపై దాడివెడలెను. పేరు ప్రఖ్యాతి లేని కెమెలు మహావిజేతవలెను నాశ్వికదళము తనవెంట నంటి

వచ్చుచుండ నెస్వరాష్ట్రము ప్రవేశించెను. జను లాతనిని నభినందించుచు జయధ్వనులు గావించుచుండిరి.

ఈవృత్తము పరిసమాప్తిజెందిన తరువాత కెమోలు కాన్‌స్టాంటినోపులుచేరి యుద్యోగమేమియు లేకుండగనే జనని భగినులతో జీవించుచుండెను. పనిలేకుండుటచే కెమోలునిరాశా పీడితుఁడు నసంతుష్టాంతరంగుఁడునై చీకాకుపడుచుండెను. తాను నిరసించుచున్న సుల్తానుగారిలో ముఖ్యులుగాని రెండవ తరగతి వారితోఁ బరిచయము గలుగచేసికొనుచు, వారినాశ్రయించుచుండెను. మహమ్మదు షెల్ కెటు కూసిచేయఁబడెను. ఎన్వరుపాలటు కెమోలునకు త్రిమూర్తులనుగలసి ప్రభుత్వమును వైదగ్ధ్యముతో నడపించుచుండిరి. త్రొవ్విటి రహస్యసంఘములు తుదముట్టినవి. టాలట్, జెమలులు మంత్రులైరి. ఎన్వరు కీర్తి, దేశాంతరములకును బ్రాకెను. అతఁడు సాంగ్రామిక శాఖా మంత్రియై రాజవంశపు గన్యను పెండ్లాడి బోస్ఫరసులోనున్న రొక మహాప్రాసాదములో సర్వసౌఖ్యములు ననుభవించుచు జీవించుచుండెను. మహమ్మదీయులనందఱను నొక్కనుగ తాను కలీఫా యాధిపత్యముక్రింద నుంచునట్టి ఏకమత్యము కలుగఁజేసి జీర్ణించిన తొట్టోమను సామ్రాజ్యవైభవమును తిరిగి సమకూర్చుట కుత్సహించెను. జర్మనిదేశపుఁ బ్రభుత్వము, వానిని మిత్రునిగా భావించి గౌరవించుచుండెను.

ముస్తఫామాత్రము మునుపటివలె నల్పసైనికోద్యోగి యయ్యెను. ఎన్వరుతో నితఁడు కలహించుటచే నాతఁడితనిని

శత్రువుగా బరిగణించుచుండెను. ఐకమత్య సంవర్ధ సంఘము యొక్క కార్యనిర్వాహక సంఘసభ్యులతనిని సహిష్ణించుకొను చుండిరి. పార్మసీదేశస్థుల విద్వేషించుటలో మాత్రమితనికిని జెమలునకును నైకమత్యము గలిగెను.

ఎన్వరు తనమనోరథమును సఫలము గావించుకొనుటకు సేనాపునర్నిర్మాణ మావశ్యకమయ్యెను. ఇందుల కాతఁడు విమనువాన్ సాండర్సులను రష్యాదేశపు సేనానిరావించి సేనా పునర్నిర్మాణమున కాతని నియోగించెను. ఇట్లుచేయుట యసం దర్భమని కెమెలు రాజకార్యనిపుణులతోను సైనికోద్యోగుల తోను విరామము లేకఁజెప్పుచు నిట్టిహానికరమగు కార్యము ఖండింపుఁడని వారల నెడతెఱపిలేకుండఁ బీడించుచుండెను.

"మన జీవనాధారమయిన సేనల పార్మసీ దేశీయుల యధీనములోనుంచుట వెఱ్ఱితనము. టర్కులము మనము. మనము మనకార్యములను జక్కబెట్టుకొనవలయును. ఈపెర ష్యను దేశీయుని యాహ్వానించుట స్వజాతీయుల నవమానపఱ చుటయగును" అని కెమలు అన్నిచోట్లను జాటుచుండెను. జెమలునుసందర్శించి వానితో వాగ్వాదముగావించెను. కెమలు కోరినను వెన్వరాతనికి దర్శనమీయకపోవుటచే నొక నిష్ఠుర మయినలేఖ నతనికంపెను. త్రిమూర్తులలో నితఁడు మిక్కిలి కష్టకారిగఁ గనబడుచుండెను. తమకు హానిచేయుట కాతనికి శక్తిలేకపోయినను క్లేశముమాత్రము కలిగించుచుండెను. ఇం తలో ఫెరీ టర్కుప్రభుత్వపు రాయభారిగ సోఫియాపట్టణము

సహాయ మొనరించెను. ఫెరీదును, కెమాలును స్నేహితులు, కెమాలును వదలఁగొట్టుకొనుట కదియే మంచిసమయమని యోచించి ఫెరీకి సాయముగా నాతనిం బంపెను.

సోఫియా కేయుద్దేశముతో నెవ్వరు తన్నంపెనో తనకుఁ దెలియును. అతనికీయుద్యోగమునిచ్చి సోఫియా కంపుట దేశ బహిష్కారము గావించుట వంటిదని యాతఁడు తెలిసికొనెను. యుద్ధవృత్తి నవలంబించినవానికి నట్టియుద్యోగములో నెట్టి పనియుండదు తనవిధులను మాత్రమాతఁడు తెల్లగా నెర వేర్చుకొనుచు బల్గేరియను సేనానాయకుఁడైన కిడ్నెఫ్‌తోను నాతని యుద్యోగులతోను స్నేహముగావించి వారి యుత్సవములలో నాగరిక్యములలోను పాల్గొనుచు వారిసేనలయుద్ధానుభవమునకై గావించు కృత్రిమయుద్ధములం జూచుచుఁ దానచట గాంచిన విశేషవిషయములను ఫెరీకి నివేదించుచుండెను.

జుక్కీసులో తనొద్దించిన సహసావాసులతో స్నేహము గావించుచుండెను తనతోఁ బోటీచేయుచున్న తోడియుద్యోగులను రాజతంత్రజ్ఞులను విద్వేషించుచు ధైర్యస్థైర్యములు గల శత్రువులతో స్నేహమొనర్చుట కెమాలునకు స్వభావము. సాహసశౌర్యశాలియైన శత్రువయినను నాతని నాతఁడు తన స్నేహము గావించెను.

కెమాలు చేయవలసినపని యతిస్వల్పము. నిరర్థకముగ నొకచో గూర్చుండుట యతనిస్వభావముగాదు. పని చేసినను కేళీవిహారములసల్పినను తదేకదీక్షతో జేయవలసినదే

కాని రోజనోవిధముగా చేయునలవాటాతనికి లేదు. చేయుటకు బని యేమియు లేకపోయినచో కేళీవిహారలోలుడగును. సాంగ్రామిక కోద్యోగస్థానమాతనికి దాత్యకర్మ నిపుణులకుండు నధికారములను నిర్భయత్వమును గలిగించుటయే గాక సైనికులకుండు శృంగారవిలసనంబులకు నవకాశమొదవించుచుండెను.

నర్తనాగారములందు శిక్షకుని యొద్ద నాతడు నృత్యము నేర్చుకొని యవకాశము గలుగునప్పుడెల్ల నృత్యము చేయుచుండెను. దర్శనగోష్ఠములకు తరుచుపోవుచు సోఫియా స్త్రీలకు శృంగారభావములు గనబడునటుల నిటుదవుటకు బ్రయత్నించుచుండెను. కాని వారికాతని చేష్టలు వికృతముగా గన్పడుచుండెను. టర్కులన్న వారికెప్పుడును నిష్టము లేదు.

ముస్తఫా రూపవంతుడుగాడు వాని చేష్టలితరుల కనురంజకములయినవి కావు. ముఖము ముడుచుకొని తిరుగుచుండుటయో హాస్యముగా సంభాషించుటయో యాతనికలవాటు పల్లవురతో సంభాషించుట గాని కామినులతో సరససల్లాపములగావించుట గాని యాతనికి దెలియదు. యువకులతో ప్రేమవిలాసముల గావించుట యాతనికలవాటు లేదు. కామినులను సంభోగమునకు నాతడు పిలిచినపుడామె యాతని కంగీకరింపక పోయిన నామెను వదలి యింకొకవనితను గోరుట యాతని కాచారము. కొంతకాలము కోవడ్చేల్ సేనానియొక్క రూపవతులగు కొమార్తెలను మోహించెను. కాని వారాతనిని నిరాకరించిరి. కొలదికాలములోనే యువకులాతని ఛాందసునిగను

వికృతచేష్టలుగలవానిగను పరిగణించి వానిజోలిపెట్టకయుం డెను. శీఘ్రకోపియగు కెమెలు మృదురీతులనాచరించుచు విప్ర లాపములు పల్కుచుండు సంఘయువతుల నిరసించుచుండెను. వారితనిమహాశూరునిగ బరిగణింపకుండుట యాతనికి గష్టము గానుండెను. తిన్నతి గౌరవముతో చూచెడి పురుషులతోను సోఫియాలోనుండు పణ్యస్త్రీలతోను మిక్కిలిసుఖకరముగ సం చరించుచుండెను. వేశ్యాగృహములలోను కేఫులలోనునూరో ద్దయమువఱకును సురాపానముసేయుచు రానక్రీడలచే రాత్రు లువెళ్లబుచ్చుచుండెను. ఘంటలకొలది ద్యూతక్రీడయొనర్చు చుండెను. ద్యూతమాడుట కెవ్వడు దొరికిన నాతనితోనాడితీ రును. ఈరీతిగ వ్యసనభూయిష్ఠుడై యింద్రియసుఖనిమగ్నుడు నయ్యెను. ఈకారణముచేనాతడు సుఖవ్యాధులకు లోనై యారోగ్యమును గోలుపోయెను. ఇట్టి జీవనవిధానముననుసరిం చుటచే స్త్రీలోకమున కాతనియెడనమ్మకముపోయెను. పురు షులలోనే బద్ధభావుడయ్యెను.

ఇట్లు కొంతకాలముజరుగగ 1914వసం॥రమున శెర్వియా దేశములలో ఆర్చిడ్యూకు కూసిచేయబడెను. అదినిమిత్తముగాం జేసుకొని యాంగ్లేయపరాంను జార్మనీ రష్యా యాస్ట్రియా హాంగరీదేశములు యుద్ధరంగమునబ్రవేశించెను. టర్కీదేశము జార్మనీదేశము యుద్ధరంగమున బ్రవేశించెను. టర్కీదేశము జార్మనీదేశ పక్షమువలంబించెను బల్గేరియాదేశ మేపక్షము నకుజేరక తటస్థముగానుండెను. టర్కీగూడ నిట్లే తటస్థముగా

నుండి యేసూచన లగపడినపక్షము లవలంబించుట యుక్తమయిన పనియైనప్పటికిఁ గెమాలు యోధుఁడగుటచే యుద్ధరంగమునకుఁ బోవుట కుత్సహించుచు, నాయుద్ధము కొలఁదివారములలో ముగియునని నమ్మినవాఁడగుటచే సోఫియాలో చేయుటకే పనియు లేకుండుట యాతనికి కష్టకారణమయ్యెను. యుద్ధరంగమునకు పిలిపింపుఁడని యెన్వరున కాతఁడు జవాబునిచ్చెను. తిరిగి తంతినంప నద్దానికిజవాబైన నీయలేదు. ఇది సహింపజాలక సాధారణసైనికుఁడుగ యుద్ధరంగము బ్రవేశింప నుద్యుక్తుఁడై యున్న కెమాలును కానిస్టాంటు నోపిలునకుఁ దిరుగరమ్మని యెన్వరాజ్ఞాపించెను.



౫

అది 1915 సం॥ ఫిబ్రవరి మాసము. ఎన్వరు రష్యను లతో బోరాడుటకై కాకసు ప్రాంతములకు సేనను దీసుకొనిపోయెను. కుంటివాఁడైన హాకీపాషా క్వార్టరు మాష్టరు జనరలు అధికారస్థానములోనుండెను. ఎన్వరుయొక్క యిష్టానిష్టముల నరకుగొనక సైనికోద్యోగుల యవసరములనుపాటించు చుండుటచే కెమలువంటి యుద్ధనిపుణునివిడచిపుచ్చలేకపోయెను. ఆంగ్లేయులు రెండుపర్యాయములు దమ యుద్ధనావలతో డార్డ్‌నెల్సు మూలముగా తోసికొనివచ్చుటకుఁ బ్రయత్నించిరి. ఆంగ్లేయులు గాల్లిపోలిని జయించుటకై గుప్తదేశముతో ఘనమైనసేనను కూర్చుచుండిరి. లిమనువాన్ శాండర్సు వారినడ్డుటకై యెడతెగని ప్రయత్నము సల్పుచుండెను. కెమలుని యుద్ధకుశలతను గుర్తెరింగినవాఁడగుటచే హాకీపాషా యాతని రావించి సాండర్సున కాతనిఁ బ్రశంసించెను. గాల్లిపోలి దక్షిణభాగములోనున్న సేనలపై లిమను కెమాలును నధికారిగాఁ జేసెను.

సాధారణ టర్కీ సైనికోద్యోగియన్న లిమనునకు నిరసనభావమేగాని యచిరకాలములోనే యాతఁడు కెమలుని యుద్ధకౌశలమును దెలిసికొనెను. ఆతఁడు తన యుద్దేశములను నిష్ఠురముగాఁ జెప్పు స్వభావముకలవాఁడు. అది పలుకష్టములకుఁ గారణమయినను, సాంగ్రామికోద్యోగిగ నాతఁడసాధారణ ప్రజ్ఞను చూపఁగలఁడని లిమనునకు నమ్మకముగలిగెను. ఏవిషయమును సవిస్తరముగ బరిశీలించినగాని యాతఁడు దనయుద్దే

శములు తెలుపదు. దయయున్న నిసుమంతయు లేని పరమ కఠినుడు పరులను నొప్పించు స్వభావము గలవాడు. ఆతనికి గర్వము మెండు. హీనికి దోడు కెములున కహంకారమధికము. “అతికౌశలము గల సాంగ్రామిక యోధుడగు, నాయకుడు” అని వాన్ సాండర్సు కెములుం గూర్చి చెప్పుచు నాతనిం బూర్ణముగా విశ్వసించుచుండును.

సామాన్యముగా బరదేశీయులను వందు ముఖ్యముగా నెన్వరు దెచ్చిన ఫ్రాన్సీయులను కెములు ద్వేషించుచున్నను వాన్ సాండర్సు మాత్రము గౌరవించుచుండెను. ఎంతవారి నయినను బ్రశంసించు స్వభావము కెములునకు లేదు. ‘అయిను వాన్ సాండర్సు నకు నున్నతాధికారికి నుండవలసిన గుణములన్నియు నున్నవి. మేము తరుచుగా భిన్నాభిప్రాయుల మగుచున్నను నా యిచ్చవచ్చినట్లు వారి యాజ్ఞల నిర్వహించుటకు దగు సామర్థ్యము నాకిచ్చుచున్నాడు” అని యా సేనానిగూర్చి కెములు చెప్పెను.

ఎనుబది వేల సైనికులు నైగు ప్రదేశమున నాంగ్లేయులు సిద్ధపరచియుండిరి. ఘనమగు యుద్ధనౌకాదళము సిద్ధముగ నుండెను. జర్కరోయా ధన్య పట్టణములను డి యాంగ్లేయులు బాడి వెడల సంసిద్ధులగుచున్నారని చారులు చాటుచుండిరి. గాల్లిపోలీ ద్వీపకల్పము యొక్క సముద్రతీరము నేబది రెండు మైళ్ల పొడవు కలది. దేశములో పర్వతములు మెండు. నానిలో నెగ్జైనకొండను దేన్నైన స్వాధనముచేసుకొన్న సాండర్సు

సైన్యములను దేశమునుండి తఱిమి వేయుశక్తి యాంగ్లేయులకుం
గలుగు. ఈ యేబదిరెండు మైళ్ళపొడవయిన సముద్రతీరములో
నెచ్చటనో యొకచోట నాంగ్లేయులు దమఘనయుద్ధనావికాద
ళ సాహాయ్యముతో నేయేబదివేల సైన్యముదించి యేదియో
యొక యున్నత పర్వము సాధించి టర్కీసేనలు రూపుమాపి
కానిస్టాంటునోపిలు మార్గమును నిరాటంకముగా గావించు
కొందురని యాతనిభయము. సాందర్సునొద్ద నరువదివేల సైని
కులుండిరి. ఆ సేనను మూడుభాగములుగా విభజించి యా
భాగములను మూడుస్థలములలోనుంచెను. ఆంగ్లేయసైన్యము
లవతరించినచోటనున్న టర్కీసైన్యములు శత్రువులకన్న నల్ప
సంఖ్యాకములు. వారినెదుర్కొని సాహాయ్యము వచ్చువఱకు
నిరోధించవలయునని యాతనియాజ్ఞ. ఇంతలో నన్వరు రష్యా
నుండి తిరిగివచ్చి కెమాలు నధికారస్థానమునుండి తప్పింపవలయు
నని సాండర్సు నాజ్ఞాపించెను. సాండర్సు తదాజ్ఞను విచారించి
నను చేయునదేమియులేకను కెమాలును సేనలో 19వ భాగమున
కధనాగ నియమించి మైదానలో పోష్టిరక్షక సైన్యముగా
దానిని నియమించెను. ఆంగ్లేయులెదుర్కొను ముఖ్యస్థానము
తెలియుటకు నతి జాగరూకతతో సంచరింపవలయునని
యాతని నాజ్ఞాపించెను. ఎన్వరుయొక్క చేయడమువలన కోపా
విష్టుడయ్యు కెమెలు వాన్ సాండర్సునందు గౌరవము కలవా
డయి యుండుటచేతను తనయాధీనములోనున్న బలమును ఒక
టర్కీలదళమును దుర్బలములయిన కొందరబ్బీదళములును
నచిరకాలములో తెస్సగా జయింపగల దిట్టముగ మార్చి చూపె

చుండ డంబయుద్ధకారులు చొనకుబేరు యొక్క యొకప్రక్క-
నుండి వచ్చుటచూచి మీారేమి చేయుచున్నారని యడిగెను.

"ఆంగ్లేయు లోడలుదిగి భూమిని జేరినారు. సముద్ర ప్రాంతముననున్న సేనారక్షకదళములోనివారమగు మమ్ము వెనుకకు దఱిమినారు."

"వారెక్కడ యోడనుండిదిగినారు"

"అరిబురున్నలో"

"నిస్త్రాంశములనమర్చి వెనుకకు దుముకుడు" అని కెమెలు వారిని యాజ్ఞాపించెను.

ఇదియైన కొన్నినిముషములలోనే కుడిప్రక్కనున్న తొమ్మిదవఖండమునుండి యాంగ్లేయసైనికు లాప్రదేశమును జేరినట్లును తనపార్శ్వము రక్షించుట కొకదళము కావలసియున్నట్లును తొమ్మిదవఖండ సైన్యాధికారి ఖబురంపెను. ముస్తఫా తక్షణమే యోచించి బులేరునొద్దనే యాంగ్లేయసైన్యములు యుద్ధమారంభించునని వాన్‌సాండర్సు నమ్ముచున్నను, చొనకుబేరు మాత్రమే యుద్ధరంగమునకు ముఖ్యస్థానమని నిశ్చయించెను. ఇంతలో గొప్పసైన్యము పోతములనుండి దిగుచున్నదనియు, నాంగ్లేయులు చొనకుబేరును స్వాధీనపఱచుకొనుటకే ప్రయత్నించుచున్నారనియు నిశ్చయమయ్యెను. ఏమైననుసరియే చొనకుబెరును సంరక్షించుటయే ముఖ్యకర్తవ్యమనియు, వెంటనే ప్రతిక్రియ నారంభించినగాని లాభముండదనియు నిశ్చయించుకొని "మనయొద్ద గుండుతోటి తూటాలా, గుండులేని

తూటలా యున్నవని" ప్రక్కనున్న యుద్యోగినడిగెను. అధికారి వస్త్రములోనున్న మేజరు "గుండ్లు" అని ప్రత్యుత్తరమిచ్చెను. "అట్లయిన చానకు బేరున శత్రిత్వరితముగా సైన్యములో" బోవలెనని యాజ్ఞనొసంగెను. ఆతనిచేతిలో నొక యుల్పపరిమాణప్రదేశమును తెలియజేయుటకై వ్రాయబడిన దేశపటముండెను. చూరకంటిరాయినాయకములో నొకసైనికుఁడు దారి చూప రెండువందలమంది సైనికులతో నాతఁడు ముందుకు బోవుచుండెను. ఆప్రదేశము మిక్కిలి నిక్కుటుగలదై ఱాళ్ళతో నిండియుండుటయే గాక పెద్దకందరములచే ఖాటితమైనట్లుండెను. ఆతఁడు కొండశిఖరము నెక్కునప్పటికి కొలదిమంది సైనికులే యాతనితోనుండిరి. తనకు క్రిందుగనే గిరినితంబమధ్యభాగమున నాల్గువందలగజములదూరమున నాస్ట్రేలియా సైనికదళము కొండనెక్కుచుఁ గాన్పించెను. ఆదళనాయకుఁడు సైనికుల ప్రోత్సహించుచుఁ గొంతదూరములోనుండెను. ఆతఁడు దనయొద్దనున్న యధికారులందఱిలోఁ బెద్దయగు వానిఁబిలచి తగినంతమంది సైనికులను సమకూర్చి యాశత్రుదళము నెదుర్కొనుమని యాజ్ఞాపించెను. ఏఁబదియేడవదళములోనివారందఱు నలసి యూపిరిరాక కొండ చివరభాగమునుఁ జేరగనే వారిని తానే వ్యూహముగా నేర్పఱచి ముందునకు నంపెను ఇంతలో శతఘ్నికామాన శ్రేణి యాశిఖరమును జేరెను. అందులో మొట్టమొదట శతఘ్నికను తగిన స్థానములోనికి దానే త్రోసెను. శత్రువిముక్త శతఘ్ని గోళికావర్షమతని చుట్టను బడుచుండెను. ఉన్మత్తునివలె నమా

నుపసత్వముతో నాతఁడు పాటుపడుచుండెను. సేనాని యాజ్ఞ లేకుండ దనస్వాధీనమయినే రెండవ సేనాఖండమును యుద్ధరంగములోనికి గింపెను. ఇందువలన ప్రయోజనము లేకుండుటచే గానలయుఁ మూడవ సేనాఖండమునుగూడ యుద్ధములోనికి దింపెను, జాగరూకతగలిగి వంచనఁ పుమని చెప్పిన సేనాని యాజ్ఞను నిరాకరించి ప్రాంతికసైన్యము లేకుండ జేసికొనియెను. అవసరముగలిగినచో యుద్ధముచేయుచున్నవారలకు సాయముచేయుట కొక్కసైనికుఁడైనను లేకుండెను. తానున్న చోటననే యాంగ్లేయుల ముఖ్యపాతము జరుగక యింకొక చోటయయినయెడల తనచర్యవలన మహాదుపద్రవము టర్కులకు జరుగుట నిశ్చయము. అటుగాక యుండిన దాను జేసిన యూహాయుక్తమేయగును. ఈతని కాతనివిశ్వాసము మెండుగా నుండుటచే తానూహించి యీపన్నాగము సరియైనదేయని పూర్ణముగా విశ్వసించియుండెను. ఆదినమెల్ల పర్వత నితంబ భాగమునం దతితీక్షణముగా యుద్ధము జరిగెను. మూడుభాగములలో రెండుభాగములవఱకు నాంగ్లేయసైన్యములు కొండ చరియనెక్కఁగలిగినవి కాని యది దాటిపోఁజాలినవికావు. టర్కులసైన్యము మిక్కిలి యలసిపోవుచుండెను. పంబదియేఁడవదళములో చాలభాగము సైనికులు నశించిరి. అరబ్బుసైనికులు యుద్ధమువిడచి పారిపోవఁ బ్రయత్నముచేయుచుండిరి, ఆస్ట్రేలియాసైనికులుగూడ నలసిపోయిరి. ఇరుకక్ష్యలవారు నిట్లలసియున్న సమయములోనే పక్షమువారికి మఱికొంత సైన్యసహాయము లభించునో వారికి జయము సిద్ధించుట

దప్పదు. రాత్రియగు దనుక పర్వతోత్సంగము టర్కీల వశమున నే యుండెను. ఆస్ట్రేలియా సైనికులు మాత్రము కొంచెము క్రిందుగా నా పర్వతనితంబము నాశ్రయించి యుండిరి. ముస్తఫా పర్వతోత్సంగమునకు వెనుకఁ గొంచెము దూరములో తన కార్యస్థానము నేర్పఱచి యా రాత్రియును, మఱుచటిదినమును నాంగ్లేయ సైన్యములను సముద్రతీరమునకుఁ దఱిమివేయుటకై యొక యాఘాతము వెనుక నింకొకటి చొప్పున బంపుచునే యుండెను. ఆస్ట్రేలియా సైనికులు పర్వతోత్సంగమును వశపరుచుకొనలేకపోయినను ధైర్యముతో చలింపక యచటనే యుండిరి.

చోనకుభేరు పర్వతోత్సంగము నాక్రమించిన డార్డనెల్సు వశమగును, డార్డనల్సు వశములోనుండిన కానిస్టాంటునోపిలుగూడ వశపడును. ఇట్లు డార్డినల్సు, కానిస్టాంటునోపిలు, నాంగ్లేయులకు వశమయిన పార్మనీ దేశమునుండి టర్కీ వేఱుచేయఁబడును. పార్మనీ సాగరము లేనప్పుడు టర్కీ ప్రభుత్వ మాంగ్లేయులతోఁ సంధిచేసికొనును. అప్పుడు గ్రీసు, రుమేనియా, బల్గేరియా మున్నగు ప్రభుత్వములుగూడ నాంగ్లేయ పక్షమునే యవలంబింపగలవు. ఈ కారణముచే రష్యా దేశములోనికి నిర్విరోధమయిన మార్గమేర్పడి, యుద్ధపరికరములు భోజనపదార్థములు తీసికొనిపోవుటకు వీలగును. ఈసంభవము లేవియు జరుగకుండ నిరోధించుచు, ముస్తఫా ప్రకృష్టవ్యక్తి

నిద్దేశమువలన దుర్బలులై మిక్కిలి యలసియున్న టర్కుల సైన్యములను యుద్ధరంగముపై నిలువబెట్టి యుంచెను.

ఆస్ట్రేలియా సైనికులు ముందంజవేయలేక యుండిరి. టర్కులువారిని సముద్రతీరమునకుఁ దఱిమి వేయలేకుండిరి. ఇట్లు రెండుపక్షములవారు నాళీఖననము ప్రారంభించిరి. కొన్ని వారము లిట్లువారు నాళీఖననముజేసి సురంగముల దవ్వి పడరానిపాట్లుపడిరి.



## ౬

ఉపద్రవమెటనుండి సంభవించునో యని రేయింబవళ్ళు కాచుకొనియుండిరి. ధైర్యము నశింప దేహమొప్పమును నుసు చుకొనియుండుటచే నాళములలో గలుగుబాధ మిక్కుటమగు చుండ ధృతిని నశింపఁజేయు ఘనశతఘ్నీనాళములు తగిలి తెంపులేని దుర్భరమగు నినాదము గావింపఁబడెను. ఎన్నాటికినిఁ జెందని యుభయపక్ష నాళములలోని యంతర్నాళములపైన సంకటలోహతంతువుల బాగుసేయుఘటి సైనికహృదయముల విదళించుచుండెను. నాళశకటమునొద్ద గుమిగూడి శత్రువులపై నొక్కుమ్మటుగా దాడి వెడలిపడుటకై వేచియుండుట, తీవ్రవేదన ననుభవించుచు నే సమయమున హఠాత్తుగా శత్రువులు నిస్త్రింశములతోను చేతిగ్రెనేడులతోను దమ్మపైఁబడుదురో యను దుర్భరవ్యథ మనముల బీడించుచుండ, నన్నినాళములలో కరుణావిరహిత శత్రునిస్త్రింశములకు బలియగుచును భయపక్షములువారును, నాళయుద్ధము గావించుచుండిరి. ఈ దుఃఖములకుఁదోడు గ్రీష్మతపనుని తీవ్రప్రతాపము దినదినమునకు నెచ్చుచుండెను. దాహోపాదకములు లేకుండెను. తపనుని ప్రచండప్రకాశముచే నిర్వృక్షశిలామయపర్వతములు పరితప్తములై తత్తాపరక్తధూళిచే నాకసము నింపుచుండెను. నాళపంక్తులమధ్యను శవములు పతితములయ్యుండ స్థూలనీలమక్షికలు నభోంతరాళములనుండి భోజనపదార్థములపై కప్పువలె

కప్పుచునుండెను అతిసారము విషజ్వరము కోట్లకొలది యూకములు సైనికులను పీడింపనారంభించెను. రెండుపక్షములవారును రోగనివారణశక్తి శూన్యులయి యుండిరి. ఇట్టియవస్థలో నైనను కెమెలు కొంచెమయినను విశ్రమించుట కవకాశము నొసంగలేదు. యుద్ధముచే సంతోషపూరితమైన మనస్సుగల వాడగుటచేత స్వల్పముగా నిద్రించుచు విరామము లేకుండ నుద్యోగులచే పనిచేయించుచు నతిశ్రద్ధతో సవిస్తరముగా నిర్ణయములచేసి యసందిగ్ధములగు నాజ్ఞల నొసంగుచుండెను. కెమెలునకు కుడివైపున సైనికదళముల కధికారియైన కాన్నెనుగీజరు అతని శక్తిసామర్థ్యములను జూచి విస్మయమందెను.

యుద్ధరంగమునకు బయలుదేరి యుద్యోగులతోడను సైనికులతోడను మాటలాడుచు సరియైన సమాచారమును తెలిసికొనుచుండెను. నాళశిరములలో నిక్కిని గాళ్లగుట్టలు మున్నగువాటి ప్రక్కను నక్క శత్రుసైనికులు కాన్పించునరికి వారిందుపాకీగుండ్లతో ప్రేల్చి చంపు ప్రమాదమండలములోనికి సైతము బోవుచు యుద్ధభూమిని బరీక్షించుచుండెను. మేమానమందయి నసంధిసమయములోను శవములనుభూమిలో, పుంజుగణముల లో నల్పోద్యోగిగాపనిచేసియు నాస్ట్రేలియనులున్న నాళములను బరీక్షించెను. ఎడతెగకుండ నెక్కడికక్కడ శత్రువులకయి దాడి వెడలుచుండెను. ఆపాతమయము వచ్చునరికి దానాస్థలమునను నుండి సైనికులను శత్రువులపైకి బంపుచుండెను. ఒకప్పుడు

తానే వారలకుదారి చూపుచుండును. ఒకనాడైనను తాను విశ్రామింపక సైనికుల విశ్రామింపనీయక యుద్ధము తెగనియుద్ధముగా సాగించుచుండెను, పెక్కుపర్యాయములు వడగళ్ల వర్షములో వడగళ్లవలె తుపాకిగుండ్లు పడుచున్నప్పుడు యుద్ధరంగములోనుండి సామాన్యసైనికునివలె దాను ప్రమాదకరములగు స్థలములలో విజృంభించుచు నిరుపార్శ్వములను సైనికులలో ననేకులు విగతజీవులగుచుండినప్పుడును తానొక్కమారైనను గాయమయిన జాడ లేదు. ప్రాణములపై నాశలేనివానివలె దాను నిర్భయముగ సంచరించుటచేత నుత్సాహపూరితులయి సైనికులు యుద్ధమును జరుపుచుండిరి.

ఒకనాడాతడు ఘోరనూతన నాళముపై గూరుచుండ నాంగ్లేయులు కామానశ్రేణి నాతనిపై ప్రేల్చనారంభించెను. శతఘ్నికాప్రయోక్తలు చివరకు లక్ష్యమును బాగుగా గురితించుటచే గెమెలున్న స్థానముచుట్టును శతఘ్నిగోళికావర్ష మధికమగుచుండెను. ఉద్యోగులాతని నాస్థలమును విడిచి పొమ్మనిరి. కాని యాతడు "అట్లు చేయకూడదు. ఈసమయములోనే నేను రక్షణము నన్వేషించిన సైనికులకది దుష్టమగు దృష్టాంతమగు" అని ప్రత్యుత్తర మిచ్చెను. కొంచెమయినను భీతిలేక సిగిరెట్టు నుముట్టించి ప్రమాదమేమియును లేని సురక్షితప్రదేశమునను న్నట్లు ప్రక్కనున్నవారితో నిష్టాలాపములాడుచు గూరుచుండెను. క్రిందినాళములలోనున్న సైనికులు కడునాశ్చర్యముతో

గెమెలును జూచుచుండిరి. కెమెలు చుట్టుప్రక్కలం బడిన గోళములచే బైకి లేగిన మట్టిచేం గప్పంబడినను నొక చిన్నదెబ్బయైయిన దగులక చెక్కుచెదరకయే యుండెను. ఇంతలో శతఘ్ని శామానశ్రేణి యింకొక లక్ష్యముపై గోళవర్షము గురియింప నారంభించెను. ఇంకొక పర్యాయము గాల్లిపోలికి దిరుగ ప్రయాణముచేయుచున్నపుడు డాంగ్లేయుల యుదకవిమానము నాతండు ప్రయాణముచేయుచున్న మోటారుబండిపై నవపాతము గావించి యాబండి ముందు వెనుకలుగూడ మార్గమును గోళపాతనముచే త్రవ్వివేసి యింకొకగోళముచే బండి నడుపు వానిం జంపినను గెమెలుమాత్రము చెక్కుచెదరక యుండెను. రక్షణములేని స్థలములలో మెల్లగా నడచుచు సైనికుల ప్రోత్సహించుచుండెను. మిక్కిలి దగ్గరలోంగూడ శత్రువుల తుపాకులాతనికి హాని గలుగంజేయకుండెను. ఏగుండును తనకుం దగులదని యాతని నమ్మకము. ఇట్టి నమ్మకముతో నిశ్చయముగా సంచరించుచుండెను కెమెలు.

జూను మాసములో శత్రుబల విన్యాసములో దోషములుగనిపెట్టి యచ్చోట నవపాతముగావించిన శత్రునాశములన్నియు గకుణతీనివై నాశములనువిడిచి సముద్రతీరమునకు బారిపోవునని నిశ్చయించి జూనుమాసమున నిరువదియెనిమిదవ తేదీనాటికి నవపాతము నేర్పాటుచేసెను. కాంత్రిగా నవ్యోధకువచ్చిన మున్వటివరగతి సైనికదళముచేతను పనునిలుదవ

సైన్యదళము లేదను దక్షిణ సైనికదళముల సాయముతో సీపని చేయించుకొనుటకు నిశ్చయించుకొనియెను. జూన్ మాసమున నిరువదియారవ తేదీనాటికి సాంగ్రామిక మంత్రియును సేనాధ్యక్షుండు నయిన యెన్వరు గాల్లిపోలీ యుద్ధరంగము దర్శించి కెమలుచే నేర్పరుపఁబడిన యీయుపాతము నుండదని శాసించి పయియధికారుల యంగీకారము లేకుండ నిట్టిపనులఁ గెమలు చేయకూడదనియు గెమెలు దలపెట్టిన కార్యమయుక్తమనియు ప్రయోజనములగునవపాతములలోఁ గెమెలు సైనికుల ప్రాణముల నకరుగానరున్నాఁడనియుఁ జెప్పుచు రెండు శతఘ్నులను బందీకృతులను జూచినగాని తానామాటల నమ్మననియుఁ జెప్పుచుఁ గెమెలు నగౌరవపఱచెను. కెమెలింతలకు గోపముతో మండిపడుచు నుద్యోగమునకు రాజీనామా నంపెను. వాన్‌సాండర్సు కెమెలునియొక్క శక్తిసామర్థ్యము లెఱింగినవాఁడుగనుక నాతనిం బ్రతిమాలి యనవసరముగా జోక్యము కలిగించుకొనినందున కెన్వరునునిందించి యాతఁడు కెమెలు తంత్రము నంగీకరించునట్లు చేసి రాజీనామాను సంహరించుకొనుమని కెమలుతోఁ జెప్పి యొప్పించెను. ఎన్వరు చేష్టలచేఁ గెమెలు నిరుత్సాహపూరితుఁడై చేయవలసిన ప్రయత్నముఁ బూర్ణముగఁ జేయకపోవుటచే నీయుపాతమువలన నపజయము సంభవింప పదునెనిమిదవదళము నాశనమయ్యెను. ఈచెనుగు కెమెలువల్లనే గలిగినదని యెన్వరు నిందించుటచే మరలఁ గెమెలుద్యోగమునకు రాజీనామానిచ్చెను. వాన్‌సాం

డక్స్ నిర్బంధమువలన మరల నుద్యోగముచేయుట కంగీక
రించెను.

జూలై మాసాంతములో నాంగ్లేయులు ఘనమగు నవపాతము ను సంకల్పించినట్లు టర్కీల సేనానికిఁ దెలిసెను. విశేషముగా సైనికదళముల నాంగ్లేయులు సిద్ధపఱచు చున్నారనియుఁ దెలిసెను. అన్నిచోట్లనుండియు సాధ్యమయినంతవఱకు సిలయిన ప్రతిసైనికునిగూడ గాల్లిపోలీలోనికి టర్కీల సేనాని పంపెనుగాని వాన్‌సాండర్సునకు మాత్రమెచ్చోట నాంగ్లేయావపాతము జరుగునో తెలియకుండెను. ఆగష్టు మాసమునందుఁ 6వ తారీఖున నాంగ్లేయావపాతము సంభవించెను. చొనకుబేరు కుత్తరమునయున్న హాజాబేమనను శిఖరమును వశపఱచుకొని యాక్రమించుట కాంగ్లేయులే ప్రయత్నముఁజేసిరి. ముస్తఫా కెమెలున్న నాళములకుఁ గుడిప్రైపున నాశిఖరమున్నది, కొండచరియలపై టర్కీల సైనికులుండిరి. కాని శిఖరముపై లేరు. ఆంగ్లేయులా శిఖరమును స్వాధీనముచేసికొనిన వారు చొనకుబెరును చేత శతఘ్నికాగోళ వర్షముంగురిపించి టర్కీల రక్షణములన్నిటిని బార్శ్వముననుండి స్వాధీనపఱచుకొని ద్వీపకల్పముఁ జయింతురని నిశ్చయమయ్యెను.

ఒకదళ మాస్ట్రేలియనుల యెడమప్రైపునుండి హాజాచమనుపై దుముకుటయు నిరువదియైదువేల సైనికులుగల యింకొకదళ మచటి క్రైనుమువుళ్ళ కుత్తరముగా సల్వాఖాత

ములో భూమిపై నవతరించి దేశములోనికిఁజని హాజాచె మనుపై దాడి వెడలిన దళములతోఁగలిసి ముందునకుఁ బోయి ద్వీపకల్పకంఠమును బట్టుకొనుట కాంగ్లేయులు ప్రయత్నించిరి. ఇందులో జయముగాంచినయడల డార్డినల్సువారి యధీనమగును. డార్డినల్సు వశమయిన కాన్స్టాంటు నోపిలునకుదారి వారిచేతు లలోనే యుండును.

ముస్తఫా సైన్యములకెదురుగా నాస్ట్రేలియనులున్న ప్రదేశసమీపమునందలి సముద్రతీరముననొక వారముదినములు ప్రతిరాత్రియు నాంగ్లసైనికులోడలనుండిదిగి యతిగుప్తముగా దాగియుండిరి. ఆఱవ తేదీరాత్రి వెన్నెలలేదు. కటికచీకటిలో పదునాఱువేలమంది యాంగ్లసైనికు లాస్ట్రేలియా సైనికుల వెనుకభాగమునుండి సముద్రతీరముననే యొక మయిలుదూరము నడచి నీరులేని గడ్డలోనుండి హాజాచెమను శిఖరమునుఁ జేరుటకయిఁ బయలువెడలిరి. వారాశిఖరము నుదయమగు సరికిఁజేరున ట్లేర్పాటులు గావింపఁబడినవి. ఈయుదంతము వా॥ సాండర్సునకు దెలియగనే యాతఁడు కాన్నెను కేజరును తన సైన్యములతో వారినెదుర్కొనుమని యాజ్ఞాపించెను. అనిమ్నోన్నత ప్రదేశముపై నతిత్వరితముగాబోయి కాన్నెను కేజరు శిఖరము నుదయము నాలుగూ ముప్పదినిమిషములకుఁ జేరెను. ఆ సంధ్యాసమయమున వెలుతురధికముగా లేనిసమయములో నాతఁడు మూఁడువందల గజములక్రిందుగా

కతికష్టములతో నాసిరంబ ప్రదేశము నెక్కియున్న యాంగ్లేయ సైన్యమును జూచెను. అతనితో నమువదిమంది సైనికులు మాత్రమే యుండిరి. ఆంగ్లేయ సైన్యములను జూచినతోడనే తుపాకులతో వారిపై గాల్పు నారంభించెను. బలమైన శత్రుసైన్యము లచ్చటనుండి తమపై బడుదురని యాలోచించి యాంగ్లేయు లచ్చోట నాగిరి. టర్కీల రక్షకదళములు వారిని గని ధైర్య సైన్యములతో నడచిరి. రాత్రియెల్ల సూదులవంటి రాళ్లతో నిండిన నిర్జరములగు గుట్టలలో నడచి యాంగ్ల సైనికులెన్నియో కష్టముల బడిరి. రాత్రి వేడి మిక్కుటముగానుండెను. ఆ సైనికులు విశ్రమించు కుతూహలముతో నుండిరి. అదినమంతయు వారు విశ్రమించుచుండ కెమాలప్పటికి వీలయినంతమంది సైనికులను పంపి నాశము లదర్పించెను. కొన్ని నగీజయునకు గాయములు తగులుటచే ముస్తఫాయే వారిపనినిగూడ జేయుచుండెను. ఇంతలో సుల్వాలో గూడ నాంగ్ల సైన్య మోడలనుండి సముద్ర తీరమునదిగి విశ్రమించుచుండెను.

వాసవాండర్సాంగ్లేయ సైనికులు చేయుచున్న "లోత్రిసన" పాతమును దానివలన కలుగు నుపద్రవమును గుర్తెరిగి మైదానమునుండి పారిపోయిన సైన్యములను పరాజయము చేసిన సకలి త్వరితముగా గొంపోయెను. బులేయినుండి వీలయిన ప్రతిసైనికునుగూడ సుల్వాలో నాంగ్లేయుల నిరోధింపుమని పంపెను.

సువ్లాలో నాంగ్లేయుల నెదుర్కొనుట కొన్ని పదునేనువం
దల సిపాయులు మాత్రముండిరి. ఆగష్టుమాస మేడవ తేదీ
నాంగ్లేయులు విశ్రమించుటమాని నిశ్చయించి నీటిని బ్రయా
ణముసాగింప వారి నెదుర్కొనియున్న యూరోపదిపాటి టర్కుల
సైన్యమును నలిపినచో జయముంగాంచియుందురు. అట్లు
చేయుటమాని వారేడవ తేదీని పూర్ణముగా విశ్రమించిరి. ఎని
మిదవ తేదీనాటి యుదయమున హూజాచెమనుపై నాంగ్ల
సైన్యములు దాడివెడలెను. ఆంగ్లేయ సేనల మధ్యస్థభాగము
పర్వతములో పల్యయనమువలెనున్న భాగమును జేకొనుటకుఁ
బ్రయత్నించుచుండెను. ఒకవైపుననున్న సైన్యములు హూజా
చెమనుపైని రెండవవైపుననున్న సైన్యములు చోనకుబేరులోని
నాళములోనున్న టర్కులపైకి దాడిసలిపినవి. సంగ్రామమతి
ఘోరముగా జరుగుచుండెను. చోనకుబేరుశిఖరమును న్యూజీ
లాండర్సుచేరగా కెమాలువారిని దరిమివేయుటకుఁ బ్రయత్నిం
చెనుగాని వ్యర్థప్రయత్నుఁడయ్యెను. ముస్తఫాక్రింది యుద్యో
గులు సైనికులెల్లరు నలసిరనియు నపజయము సిద్ధించుట దప్ప
దనియు వెనుకకుఁ బారిపోవుట మంచిదనియుఁ జెప్ప నారంభిం
చిరి. వారట్లు భయవిహ్వలులైయుండ కెమాలుమాత్ర మతి
ధైర్యముతో సంచరించుచు నగ్నివర్షము గురియుచున్న ప్రదే
శములలో నిర్భయముగా దిరుగుచు స్వకీయులకు ధైర్య
స్థైర్యములచే సైనికుల నుత్సాహవంతులఁగాఁ గావించుచుండెను.

ఆంగ్లేయులుపల్యాయనమునుగాని హోంజాచెమను శిఖరమునుగాని చేరలేకపోయిరి. చొనకుబేరు శిఖరమునుజేరిన వారచ్చటనే యుండిరి.

ఆరాత్రి అనఫార్టాయను గ్రామములో వాన్సాండర్సుండి కెమెలునకుఁ గబురంపెను. బులేరునుండిరమ్మని యాజ్ఞాపించిన సైన్యములింకను నచ్చటికి జేరలేదనియు నట్లు సేరక పోవుటకు వారి యధికారియైన ఫెవ్జీయొక్క చేతగానితనము నాలస్యశీలత ముఖ్యకారణములనియుఁ జెప్పుచు ప్రచండ కోపియై యాతనిసేనానాయకోద్యోగము నుండితప్పించి తానున్న యుద్ధరంగములోని సేనలనన్నిటిని జమచేసి వానికధిపతిగా కెమెలును నియోగించెను. సుల్వాలోనున్న యాంగ్ల సైనికుల నెదుర్కొనుట కతిస్వల్ప సంఖ్యాకులున్నారనియును, నాంగ్లేయులు కొలదికాలములోనే యచ్చటనుండి ద్వీపకల్పములోనికి బ్రవేశింపఁ బ్రయత్నించెదరనియు, వారినడ్డువారు లేరనియు టర్కులయవస్థ మహాకష్టములోఁబడియున్నదనియుఁ జెప్పుచు చేయుటకేమియు గాన్పింపక చీకాకుపడుచుండెను. కెమెలధికారమునుస్వీకరించి యాంగ్ల సైనికులనడ్డుటకై యెడతెగని యేర్పాటులగావించుచుండెను. ఇంతలో ఫెవ్జీయొక్క సైన్యములాస్థలమునకుఁ జేరినవి. అప్పుడు వారికతిస్వల్పమగు విశ్రాంతి నొసంగి మఱునాటి యుదయమున నాంగ్లేయులపై దాడి వెడలించెను. అప్పుడే యాంగ్లేయావపాతముగూడ సంభవించెను.

ఆసేనలతో ఘోరముగా బోరాడెను. ఆంగ్లేయులుమాత్రము ముందునకు నడుగువెట్టలేక లేకపోయిరి. సుల్వా సురక్షితముగా నుండెను.

ఇంతలో చొనకు బేకు హూజాచెనువు శిఖరములయందుఁ బోరాటము తీవ్రముగా జరగుచుండెను. హూజాచెనులో గొంతవఱకు నాంగ్లేయులను టర్కులు వెనుకకు దఱిమిరి. గాని హైందవాంగ్లేయ సైన్యములుగలిసి పల్యయనముపైకి నిస్త్రింశములతో నతిరయమున జేరి టర్కులను పర్వతనితంబములనుండి పారద్రోలుచుండ నాంగ్లయుద్ధనావలు పొరపాటున నాంగ్లేయ సైన్యములపైనే గుండ్లనుప్రేల్చి పెక్కుమందని వధింప వారు వెను కంజవేసిరి.

న్యూజీలెండుసైనికులు చొనకు బేకుపై స్థిరముగానుండిరి. వారి నచ్చటనుండి టర్కులసైన్యములు కదల్పలేకుండెను. పందొమ్మిదవ సేనాఖండముయొక్క యుద్యోగులు ధైర్యమును గోల్పోవుచుండిరి. ముస్తాఫాకు దమదుర్దశను టెలిఫోనుమూలమునఁ దెలియజేసిరి. సైనికులు ధైర్యపడుచున్నారనియు వానికిఁ జెప్పిరి. అప్పుడు "కెనులు మళ్ళీమియుభయము లేదు. ఇరువదినాలుగు గంటలకాలము మాత్రమోపికపట్టి స్థానముల విడువకుఁడు. అంతలో నరఫార్టాలోని విషయములను సరిజేసి నేన చ్చటికివచ్చి విజాన్యవహారములను సర్దుబాటు చేయుదును", అని కెమెలు టెలిఫోనులోఁ జెప్పెను.

రాత్రి యెనిమిదిగంటలకు ముస్తఫా చౌసకుబేరును జేరెను. శత్రుస్థానములఁ బరీక్షించుటకుఁ బానేబయలుదేరెను. అప్పుడు రెండు తుపాకీగుండ్లాతనిపై రహస్యముగా పేల్పఁబడెనుగాని దైవవశముచే నవివానికిఁ దగులలేదు. న్యూజీలండులోనున్న వాళములకతిసమీపముగాఁబోయి వారున్నస్థానము బరీక్షించి యచిరకాలములో వారినచ్చటనుండి తఱిమివేసినగాని తమకపజయము తప్పక సంభవించునని నిశ్చయించి తిరిగి కార్యస్థానమునకువచ్చి రాత్రియెల్లఁ దంత్రమునుబన్నుచుండెను. వాన్‌సాండర్సెనిమిదవ ఖండమును బంపెను. పందొమ్మిదవ ఖండమునకు మూఁడుదళములుగలిపి దాని నధికముచేసెను. వాళములలో సాధ్యమయినంత దగ్గరగా సైనికు లుండునట్లు క్రిక్కిరిసియుంచి వారితో సరససల్లాపములఁ జేయుచు వారినుత్సాహవంతులుగఁ గావించుచుండెను "నాయకులారా! తొందరపడి శత్రువాళములపై దుముకకుఁడు. నేను యుక్తకాలము చూచి ముందుపోయెదను. నేను చేయియెత్తగనే మీరు నిస్త్రింశములను దృఢముగాఁబట్టి నావెనుకరండు', అని వారితో జెప్పెను. యోధులగు న్యూజీలెండు సైనికులు విశ్రాంతికొరకుబోవుచు నాఱవనార్తులాంకషైరు దళమునకును నెనిదవవిల్ట్సుషైరు దళమునకును వాళముల నొప్పజెప్పుచుండిరి. మఱువాడుదయముగాక మునుపే టర్కులశతఘ్నులు శత్రుస్థానములపైగోళికావర్షమును గురిపించుచుండెను.సంధ్యా

# షష్టమ ప్రకరణము

సమయమునకు మూఁడుగంటలకుముందు కెమెలు నాళములను పడిచి ముందునకు నడువసాగెను. ఆంగ్లసైనికులు తుపాకులఁ బేల్చనారంభించిరి. ఒకగుండువచ్చి యాతని గడియారము వ్రక్కలయ్యెనుగాని అతనికిట్టి గాయమును దగులలేదు. ఇంతలో టర్కులు ఫిరంగులను బేల్చుటమానిరి. కెమెలు తన చేతికత్తి నడువసాగెను. టర్కీసైనికులు సింహనాదముచేసి నాళములలోనుండి బయటికిదుమికిరి. నిస్త్రింశ సముద్రమో యనునట్లు చూపరులకు తోఁచుచుండెను. సింహనాదములు సలుపుచున్న నరతరంగము లాంగ్లేయసైనికులపై బొర్లిపడెను. నాస్తులాంకషైరుసైనికులుభయవిహ్వలులై పలాయనముచేసిరి. విల్ట్సుషైరు దళము నిర్మూలము గావింపఁబడెను. వెన్నిచ్చి పారిపోవుచున్న యాంగ్లేయులను సముద్రతీరమువఱకును టర్కులు వెంటదరిమిరి. సముద్రతీరమును జేరుసరికి యుద్ధనావలనుండి ఫిరంగిగుండ్లు టర్కులపైఁబడి నాశనముగావింపఁజొచ్చెను. అది చూచి టర్కులు చోనకుబేరునకు చేరి నాళఖననము నారంభించిరి. చోనకుబేరు శత్రువులకు వశపడక రక్షింపఁబడెను.

అటుతరువాత ముస్తఫా మూఁడుమాసముల ననఫార్టా యుద్ధరంగమున సేనానియై యుద్ధమును నడిపించెను. అది ముఖ్యముగ నాళయుద్ధము. ముస్తఫా పాషాబిరుదాంకితుఁడయ్యెను. రెండుసమయములలో మాత్రము సుల్వానుండి యాంగ్లేయావపాతములు సంభవించెను. ఆ రెండు సమయము

లలో ఘోరసంగ్రామములు సంభవించెను. అప్పుడు బహు సంఖ్యాకమగు సైన్యము మరణించెను. ఆ రెండు పర్యాయములును కెమెలు చివరవాఁడగు సైనికునిగూడ యుద్ధములో వినియోగించి జయమునుగాంచెను. ద్వీపకల్పము కాన్ స్టాంటినోపిలుకూడ శత్రువులనుండి రక్షింపఁబడెను. 1915 సంవత్సరము డిశంబరు మాసములో నాంగ్లేయులా ప్రాంతమును విడిచిపోయిరి. ముస్తఫాపాషా కాన్ స్టాంటినోపిలునకుఁ దిరిగి పోయెను.

"డార్డనెల్సు కాన్ స్టాంటినోపిలులను రక్షించినవాఁడు," అని వార్తాపత్రికలు ముస్తఫాకెమెలుపాషా నభినందించినవి. యుద్ధనైపుణ్యమునందీతఁడు ప్రఖ్యాతిఁగాంచెను. ఆ కారణముచే రాజకార్యనిపుణులీతని గౌరవించుచుండుటచే తమలోఁ జేర్చి కొందురనునాశ యీతనికిఁ గలిగెను. మునుపటివలెనే టర్కీ దేశమును టర్కులే పరిపాలింపవలయుననియును, పాశ్చాత్య దేశస్థుల నుపయోగించుకొనవలసివచ్చిన సేవకులుగనే వినియోగింపవలెననియును, ఎవ్వరుచేతకానివాఁడై దేశమునకు శత్రువై దేశమునకు నాశముఁ గలిగించుచున్నాఁడనియును కెమెలుపాషా యెల్లెడలఁ బ్రకటించుచుండెను. కెమెలు అభిప్రాయములు టర్కులలో వ్యాపింపఁజొచ్చినవి. యుద్ధోత్సాహము వారిలో క్షీణించుచుండెను టర్కులకును పాశ్చాత్యదేశస్థులకును వివాదములు సంభవించుచుండెను. పాశ్చాత్యయంత్రములో టర్కీయొక భాగమయ్యెను.

జయ మెవరికిఁ గలిగినను నష్టము మాత్రము టర్కీ దేశమునకే యను ననుమానము ప్రజలలో వ్యాపించుచుండెను. జర్మని యుద్యోగుల నందఱను దేశబహిష్కృతులఁ జేయుఁ దంత్రములు పన్నఁబడెను గాని యవి సాగలేదు.

జర్మని దేశీయులు సాయముతో నెన్వరు టర్కీ దేశమున కనియంత్రిత ప్రభువయ్యెను. ఎన్వరన్నను ప్రజలలో నయిష్టము జనించెను. ఐకమత్య సంవర్ధక సంఘములోని యతని మిత్రులతోడను నతనికి శత్రుత్వమేర్పడెను. అతని విరోధులెన్నియో నిగూఢతంత్రములఁ బన్నుచుండిరి. తన్నుఁ దుదముట్టింతురను భయముచే రక్షకభట సాహాయ్యము లేకుండ నాతఁ డిలు వెడల మానెను.

కెమాలుఫాషా మిత్రుఁడైన జెమెలు సిరియాదేశములో నుండుటచే నాతఁడు ముఖ్యవజీరగు టాలటును దర్శించెను. అప్పుడు, కెమాలునకు సగౌరవముగ సత్కారముసలిపి, సాంగ్రామిక మంత్రిపదవికై తనకున్న యర్హతను దెలుపు సమయమునఁ గెమాలు చెప్పినదంతయు విని టాలటుకు సానుభూతి నగపఱచినట్లు నటించి యాతని పరోక్షమునం దాతని గర్వాతిశయమునకు బిగ్గరగ నవ్వెనట. అదివిని కెమాలు టాలటునెన్నఁడును మఱువలేదు.

పరదేశవ్యవహార శాఖలో నుపకార్యదర్శిగానున్న హాలీలను గలిసికొని జర్మని దేశస్థులే పని చేయుచున్న పరదేశ

వ్యవహారశాఖామంత్రియగు నెస్సీముతో మాటాడుట కేర్పాటు
గావించెను. ముస్తఫా కేమెలుపాషా నెస్సీము దగ్గఱకును
వెళ్లినపుడా మంత్రి పనితొందరలో నుండుటచే గొంతకాలము
పాషా వేచియుండవలసి వచ్చెను. అందులకుఁ గోపించి యాతని
దగ్గఱకేగినపుడాతనితో సామాన్యాధికారవర్గము ప్రకటించు
చున్నయుదంతములన్నియు నసత్యములనియు, టర్కీ దేశ
నాశనము సంభవింపనున్నదనియు, నెవ్వరు చేతకానివాఁడనియు
వివిమెల్లఁ బ్రధానమంత్రులగు తమకుఁ దెలిసియు నూరకుం
డుట దేశనాశమునకుఁ దామంగీకరించినట్లగుననియు నిందా
గర్భముగఁ బల్కెను. నెస్సీమది విని మిగులఁ గోపించి సాంగ్రా
మిక కార్యస్థానాధికారులతో నాయుదంతముల నివేదింపుమని
ముస్తఫాతోఁ గఠినముగఁ బల్కెను. సాంగ్రామికాధికారుల
కడకుఁ జనుట పార్సీదేశస్థులకడకు జనుటవంటిదనియు వారు
సర్వాధికారమును వహించి తన్నుఁ బంపివేయఁ బ్రయత్నము
చేసిరనియుఁ జెప్పి కోపపారవశ్యముతో నోడలు తెలియక
నెస్సీము నొద్దనుండి వెడలిపోయెను.

యథాపూర్వముగా మన కెమిలు నెవ్వాని నక్కఱచేయ
కుండెను. గర్వాధిష్టమతియై యన్వరుమతము నంగీకరింపక
యందఱు దన దగ్గఱకు వచ్చి తనయాజ్ఞల నిర్వహించుచుండ
వలయునని యాతని యుద్దేశము. ఎప్పటికప్పుడు తనయుద్దేశములు
నెరవేఱకుండుటచేఁ గోపమతిరేకించి యన్నిసమయములలోను

దనయుద్దేశములను తీవ్రముగాఁ బ్రకటించుచుండెను. ఎన్వరును జర్మనీకి జాతకులైనయందును జర్మనుఁడు కుతంత్రములు పన్ను చుండెను. చేతగాని యుద్యోగులందఱు నీతంత్రములలోఁ జాలొరిగి. ఎన్వరునకట్టి దెలిసి జాతకమును నాతనిమిత్రులను కూడ నుద్దీయించెను. కెమెలున కట్టి దండనము నే విధించి యుండినను గానియాతనిపై నెట్టి నేరమును మోపుటకు వీలు లేకుండెను. కెమెలు దూరముననుండినగాని తనకు సుఖము లేదని నెన్వరు నిశ్చయించుకొనెను. పదునాఱవ సేన కధిపతిగాఁ జేసి యానిం కాకసుపర్వతముల కంపెను. అచ్చటనుండి రెండవ సేనా దళమున కధిపతిగా మార్చి డయర్బెకిరను అతిదూరస్థకార్యస్థాన మున కంపెను.

కానస్టాంటునోపిలునుండి మూఁడువందల కిలోమీటరుల దూరమున నంగోరాపట్టణమునకొక రైలుమార్గము గలదు. కానస్టాంటునోపిలులో బయలుదేరి యీమార్గము నంగోరాపట్టణమున నంతమగును. కెమెలు రైలుమీద నంగోరానుఁజేరి యచటనుండి కొంతదూరము మోటారుబండిమీద మఱికొంతదూరము సామాన్య శకటముమీఁదను నింకను గొంతదూరము గుఱ్ఱము మీఁదను బ్రయాణము చేసి యంగోరానుండి యేడువందల కిలోమీటర్ల దూరములోనున్న సాంసునుయుద్ధరంగము చేరెను. ఆప్రయాణము మిక్కిలి కష్టభూయిష్టమైయుండెను. రాజబాటలు సంవత్సరములకొలఁది మరమ్మత్తు చేయఁబడకుండుటచే మిక్కిలి

చెడిపోయియుండెను. కొన్నిచోట్ల స్వరూపమే లేకుండెను. దేశములో శీతలోన్నత ప్రదేశమున సంగోరాయను నాగరకత లేని యొక చిన్నపట్టణముండెను. దానికిం దూర్పున సశుభగము ఫలవంతముగానిది, దాగుణశిలామయమునగు ప్రదేశముండెను. అందులో నెవ్వరో కొన్నిదరులలో దప్ప వేఱొక్కడను జనులు వసించుటకు వీలులేదు. అచట గ్రీష్మరుతులోం దాపమధికము. శీతకాలమందు చలి మిక్కుటము. ఈ దేశమందున్న టర్కీ-సైన్యములు సంపూర్ణముగా నవ్యవస్థితం జెందినవి. గతసంవత్సరములో నెన్వగుపాసాసవ్యనుల పైం బార్శ్వములనుండిపడి వారు వెనుకకుం బోవుమార్గము నరికట్టి కొనసుపర్వత శ్రేణిపైనుండి వెనుకకుం బారిపోవు నట్లు చేయుటకై యొక యుద్ధతంత్రము సంకల్పించుకొనెను. అందులకై ఎగ్జరమునొద్ద నొక పెద్దదగు సేననుగూర్చి దానియాధిపత్యము వహించుటకొఱకు దానే స్వయముగా నచ్చటికిం బోయెను. సిద్ధాంతములోని తంత్రము సరిగానున్నను దూరము, కాలము మున్నగు విషయములను సవిస్తరముగా యోచింపకపోవుటచే టర్కీ సైన్యములు పర్వతమార్గములలో జనెవరుమాస ప్రారంభమున నంధులుగా జేయు హైమానప్రకంపనములోం జిక్కువడెను. యుద్ధమునకు దాడివెడలిన నూఱువేలమందిలో పండ్రెండువేలమంది సైనికులే బ్రతికివచ్చిరి. ఒక్క జిల్లాలోనే నేశిమికై గుంపుగుంపులుగా గుమికూడి నొక్కచోనుండిన ముప్పదివేలమంది టర్కీ సైనికులు

హింసశక్తిచే నుత్సాహశూన్యులైయుండ రష్యనులు చూచిరి. నిజ టర్కీ సైన్యములలో నతిశ్రేష్ఠములైన యూనటోలియను దళములకు చెందిన సైనికులు అప్పటినుండియు కొకసుయుద్ధము పరిత్యజింపఁ బడెను. డార్డనెల్సు రక్షణమునకై ప్రత్యేక సైనికులు ప్రతిశతఘ్నియు నక్కఱలైనయుండెను. రష్యనులు మెల్లగా ధైర్యముతో బాటలను రైలుమార్గములను నిర్మించుచు నావరింపఁబడిన ప్రదేశములలో నధికారముల బలపఱచుకొనుచు దేశముల నాక్రమించుకొనుచుఁ బోవుచుండెను. నానుబిల్లిసు, మషు, ఎర్జరము ముష్కగు వానిలోని దుర్గములను స్వాధీనము చేసుకొనిరి. ఇదివరలో వారు పార్శియులతో జరుగుచున్న యుద్ధము మీదనే శ్రద్ధవహించియుండుటచే టర్కులఁగూర్చి విశేషముగా నేమియుఁ జేయకుండిరి. ఇప్పుడన్ననో వారు టర్కీ హృదయస్థానమును భేదించెడి యాక్రమిక సంరంభమును జేయ ప్రయత్నించుచుండిరి. రష్యను సేనానియైన గ్రాండు డ్యూకునికోలసీ సంరంభములను నడిపించుటకచటికి వచ్చెను.

టర్కీ సైనికులు యాహారపదార్థములు, తుపాకులు, ఫిరంగులు, మందుగుండుసామానులు, మందులు, సరిగా లేక బాధపడుచుండెడివారు. వారికి దుస్తులయినను సరిగా లేవు. సిపాయిలకీవస్తువులనిచ్చు బేహారులుగూడ నుద్యోగులతో గూడి దోచుకొనుచుండిరి. ఎక్కడఁజూచినను దొంగతనమే తాండవమాడుచుండెను సంభార పరికల్పనము సేయు సేవక

వర్గము లును, చికిత్సకవర్గముగూడ నిరుపయోగులై యుండిరి. క్షామాతిసారము వల్లను విషజ్వరములవల్లను, వేలకొలది సైనికులు చచ్చిపోవుచుండిరి. మిగిలినవారికి రోగనివారణశక్తి బహ్వల్పముగానుండెను. ఎన్వరు చేతగానితనముచే టర్కీసైన్యములిట్లు దురవస్థయందున్నందున, కొతని నిండించుచు సైన్యపునర్నిర్మాణమునకు శ్రద్ధతో గెమెలుపాషా శ్రమతీసుకొన నారంభించెను. పందొమ్మిదివందల నేడవ సంవత్సరములో రష్యనుల యుపపాతము జరుగునని నిశ్చయించి సాంగ్రామిక కార్యస్థానమునకు మందులు, మందుగుండు సామానులు, సైనికులు, తదితర సంభారములన్నియు గావలయునని తంతి నంపెను. అందుకెట్టి జవాబు రాకుండుటచే నెన్వరునకు నిష్ఠురముగా తంతివార్త నంపెను. ఎన్వరు దానికిని జవాబియ్యక యూరకుండెను. అప్పుడు కెమెలుపాషా చేయునదేమియులేక యున్నపరికరములనే బాగుచేసికొనుటకుఁ బ్రయత్నములఁ జరుపుచుండెను. వ్యాపారస్థులను, దొంగిలించు నుద్యోగులను నాతఁడు దండింప నారంభించెను. వారిలో గొంతమంది కెమెలుపాషా మనసును గుర్తెఱుంగలేక యాతనికిఁ దమ దోపిడిలో పాలునిచ్చి బ్రతిమాల మొదలుపెట్టిరి. దానికాతఁడు గిఁసి యట్టివారి నురిదీయించెను. దొంగిలించువారిని కమ్చాలతోఁ గొట్టించెను: అలసులను జేతకానివారిని దండించుచు డఫాములను, చికిత్సకసంభారకల్పక సేవకవర్గములతోఁ బునర్ని

ర్మాణము గావించుచు, సేనలను నూతనోత్సాహపూరితులుగ నొనర్పఁ బ్రయత్నించు చుండెను.

ఇస్మేలు అను నాతఁడు కెమలుపాషాయొక్క యాంతరంగికోద్యోగి. ఆతఁడు వివర్ణుఁడు: అల్పమాయినవాఁడు. చిన్నబుర్రయుఁ బెద్దవంకరయగు ముక్కును నాతనికిఁ గలవు. బాధిర్యము కొంచెమాతనికి గలదు. చెవిటివారికుండు తూష్ణీంభావముతో మెలంగుచుండును. నిశ్చలమయిన మానసిక స్వభావము, మితిమీఱిన శాంతము, నమితమగు పర్యవస్థానము నాతనికిఁ గలవు. ఆతఁడుద్యోగసంబంధ కార్యనిర్వాహదక్షుఁడు: నిత్యకర్మమునడిపించుటలో నతినిపుణుఁడు. సవిస్తరముగా విషయములఁ బరిశీలించి జాగరూకతతోను శ్రద్ధతోను యథావృత్త కార్యసిద్ధితోను నాజ్ఞల నిర్వహించువాఁడు. కెమలు తరువాత యుద్యోగి జనరలు కయ్యాజిమ్ కరాబెకిరు అను నాతఁడు, ఇతఁడు స్థూలకాయుఁడు; ఒడలు బరువైయున్నను బుద్ధిమాత్రము మందము. కార్యశక్తిగలవాఁడు, కర్మశీలుఁడు, సమగ్రుఁడు దృఢభక్తియుక్తుఁడు, సైనికులకిష్టుఁడునై యుండెను. వీరిరువురును నతి ఋజువర్తనులై యున్నతాసనములో నుగ్రులై కెమలుపాషాయందు భక్తిగలిగి వానికి హితులు సహకారులునై యుండిరి. ఇట్టిసహకారులుండి యెంతశ్రద్ధతోఁ బనిచేసినను రష్యనులు గావించినయవపాతమునకు, టర్కీ సైన్యములు చెల్లాచెదరయి శత్రువులకు వారిచ్చునని ఖిన్నుఁడగుచుండెను. ఇంతలోఁ గెమలు

పాషా యుత్కృష్టదశమున రష్యాలో రాజ్యపరివర్తనము జరుగు చుండుటచేనవ్వను సైన్యములలో శిక్షణము తగ్గెను. వారిలోనెవ రికివారు తమదేశమునకు; సైనికులు పారిపోవుచుండిరి. గ్రీకుదుర్గా ధుకొలనను మూసా-పట్టణమునకుఁ బిలిచి వేసిరి. వసంతము లోఁగావింపవలసిన యువపాతము పొడిగింపఁబడెను.

అటుతరువాత వసంతగ్రీష్మఋతువులలో రష్యను సేనలు గాలియెదుట ధూళివలె చెల్లాచెదరయి శత్రుముకై యంతరించెను. తక్షణమే కెమాలుపాషా తన సైన్యములతో ముందుకు బోవ నారంభించెను. ఆర్మేనియనులు, జార్జియనులు తీవ్రముగా వారిగ్రహామునకై పోరాడుచున్నను కెమాలు, వాను, బిట్లిసు, మషు, అనుపట్టణముల వశముచేసుకొని బాటు మునకై దాడివెడల నారంభించెను. ఇంతలో దక్షిణమున నుప ద్రవకారణముద్భవించుచుండెను. సిరియామూలముగ నాంగ్లే యులాక్రమణోద్యమమును జేయసిద్ధముగానుండిరి.

సిరియా దేశములో రాజ్యసంగమునకుఁ బ్రాముఖ్య నియు, సాధ్యమైనంతమంది సైనికులను పంపవలె నియు కానస్టాంటునోపిలునుండి పాలనము జారీచేయింపఁబడెను. కైయజీమ్ కరాబెకీరునకు తనయధికారము నొప్పజెప్పి సిరియా నుజేరుటకై కెమాలుపాషా కానస్టాంటునోపిలు పట్టణమునకుఁ బ్రయాణమాయెను.

ప్రమాదముత్పన్నమగు మండలము లీజిప్టు మెసపొటేమియా సిరియా దేశములు. భారతీయ సైన్యముతో నాంగ్లేయులు బాగ్దాదుపట్టణమును వశపఱచుకొని మూసూలుపై దాడి వెడల సంసిద్ధులైయుండిరి. ఐగుప్త దేశములో నొక సైన్యమును సిద్ధపఱచి పాలెస్టీను సిరియా దేశములపై దండెత్తఁ బ్రయత్నించుచుండెను. వారట్లుచేయకుండ నిరోధించి బాగ్దాదును మఱల వశపఱచుకొనవలెనని టర్కీల ప్రయత్నము.

జర్మనీ దేశపు సాంగ్రామిక శాఖాధికారులు సేనానియగు వాన్ ఫాల్కెన్ హేనును "బిజుగ"ను నామముతో సైన్యముల నేర్పఱచుట కెన్నరుకోర్కెపైని బంపిరి. ఆ సేనల ముఖ్య కార్యస్థానము ఎలెప్పో. అది జర్మనీ దేశపు సాంగ్రామికాధికారులతోడను సైనికులతోడను నిండి నిబిడీకృతమైయుండెను. ముస్తఫా కెమాలుపాషా యేడవ సైన్యమునకు నాయకుఁడుగ నియమింపఁబడెను గాని యాతని కది తృప్తి నొదవింపలేదు. జర్మనీ దేశీయుల యధికారమునకు లోఁబడియుండుట యాతని కనిష్టము. వాన్ సాండర్సుతో మైత్రికలిగి కలిసిమెలిసి పనిఁ జేసెనుగాని ఫాల్కెన్ హేనుతోఁ బొందుకుదురకుండెను. ఆ జర్మనీ దేశస్థుఁ డేమిచేయుటకును తోపక బంగారునాణెముల పెట్టెను కెమాలుపాషా కంపెను. ఆ పెట్టెముట్టినట్లు రశీదిచ్చి తరువాత బంగారు నిచ్చివేసినపుడు రశీదు వాపసుచేయుమని కోరెను. మొదటి యధికారివర్గ సమావేశము నెవ్వరు,

జెమలు, కెమెలు, ఫాల్కెనుహేను, తదితరులగు షార్మనీదే శపు సాంగ్రామికోద్యోగులు గూడియుండిరి. ఫాల్కెనుహేను యొక్క యుద్ధతంత్రమును కెమెలు తీవ్రముగ ఖండించెను. సూయజు కెనాలుపై దాడిని, బాగ్దాదుపై ననపాణమును, నతి పరుషముగ నిరసించెను. ఆషార్మనీదేశీయుడును కెమెలు ఖండనను దత్తండనావిధానమును మిగుల ద్వేషించెను. జెమలు కెమెలుతో నేకీభవించెను. షార్మనీదేశీయులపై జెమలునకును విద్వేషమే, కెమెలునకును ఫాల్కెనుహేనునకును వివాదలు మెండగుచుండెను. అందుచే కెమెలు తన యుద్యోగమునకు రాజీనామా నిచ్చెను. ఎన్వరు ఫాల్కెనుహేనుగూడ రాజీనామా నుపసంహరించుకొనుమని కెమెలును గోరిరి కాని యాతడందుల కియకొనలేదు. కెమెలు నధికారధిక్కారమునకై ఫాల్కెనుహేను దండింప యత్నించెనుగాని యెన్వరు భయపడి దయార్బెకిరులోనున్న సైన్యములకు నాయకుడుగ నియమించి కెమెలు నచ్చటికి బంప యత్నించెను. దానికని కెమె లంగీకరింపలేదు. పిమ్మట జేయునదేమియు లేక యెన్వరు చికిత్సావిషయకముగు సెలవును గాలపరిమితిలేకుండ కెమెలునకిచ్చెను. కెమెలు జమలునొద్ద గొంతసొమ్ము బదులుపుచ్చుకొని కానుస్టాంటినోపిలునకు బోయి చేరెను.

ఎన్వరు కెమెలుల వివాదము ముదిరి బయటబడుటకు సిద్ధముగనుండెను. షార్మనీయులుక్రింద బనిచేయుట కంగీకరిం

పక యధికారాధికార్యమును గావించినందులకు గెమెలుపైఁ జర్యజరిపినఁ బ్రజలకుఁ దనపై విద్వేషము కలుగునని యోచించి యెన్నఁ దూరకుండెను.

కొంతకాలము కెమెలు తన జననీభగినులతోఁ గూడి "అక్వారెళ్లెరు" యొక్క డెబ్బదియారవ గృహమున నివసించు చుండెను. ఈ గృహమున్న వీధి పట్టణమునకు వెలుపల లఁ గొండపైనున్న మధురలోనిది. బంధువులతోఁ గలిసి జీవించుట యాతని కెప్పుడును బాధకరముగనే యుండెను. ఆడువారెల్లప్పుడు ప్రదల్పించుచు నుపదేశించుచు ఖండించుచు నుండు గుచునుందురు. అది యాతని కిష్టము లేదు. నిత్యకృత్యములలో గూడ నితరులెవ్వరైన నాతని వ్యవహారములలో జోక్యముఁ గలిగించుకొనిన నాతఁడు చీకాకుపడును. ఈ హేతువుచే నాతఁడు "పెగాపాలెసు హోటలు"లో నొకగది నద్దెకుఁ బుచ్చు కొని యెన్వారను షార్మనీయులను నిందించుచు నేకాకియై ప్రజలతోఁ గలియక కాలక్షేపము చేయుచుండెను.

క్రమముగ యుద్ధముపైని షార్మనీయులపైని బ్రజలకు విద్వేషము మిక్కుటమగుచుండ నెన్వరు శత్రువులగు సాంగ్రామికోద్యోగులును రాజకార్యనిపుణులును గెమెలుచుట్టును జేర నారంభించిరి. ఆ కారణముచేఁ గెమెలను గానుస్టాంటునోపిలులో నుంచుట వారికిఁ గష్టమయ్యెను. 1918 సంవత్సరపు వసంతమాసమున యువరాజగు వాహెడ్డీను షార్మనీదేశమునకు

బోవుచుండ నాతనితోఁ గూడఁ గెమెలు పంపఁబడెను. అట్లు చేయుటలోఁ గెమెలును గాన్‌స్టాంటునోపిలులో నుండకుండఁ జేయుటయే కాక జర్మనీయ యుద్ధసన్నాహమును వారి విశిష్ట సాంగ్రామిక సంస్థాపనమును చూచినచో జర్మనీదేశీయులపైఁ గెమెలునకుఁ గల యభిప్రాయము మారుననుచు నాశ యెన్వరున కుండెను.

చేయుటకేమియుఁ బనిలేకుండుటచేఁ గెమెలు యువరాజుతో జర్మనీదేశమునకుఁ బోవుట కియ్యకొనెను. అప్పటిలో నెట్టి మార్పు జరుగుటకు నవకాశము కాన్పించుటలేదు. ఎన్వరు సాంగ్రామిక సంస్థానాధికారియగుటచే సాంగ్రామిక రాజ్యాంగములోఁ దనకెట్టి యవకాశము నగపడలేదు. జర్మనీదేశమునకుఁ బ్రయాణమగుటకు రెండురోజులు ముందు కెమెలు యువరాజు దర్శనము చేసెను. ఒకకోష్ఠములోఁ గొంతకాలమాతని దర్శనమునకై వేచియుండఁగా వహీద్దీనందు ప్రవేశించెను. తనకుఁ జాలని యుదయకాలధార్యములగు దుస్తులను ధరించి పొడవైన మెడయు, మనోకార్శ్యముగల ముఖము, పొడవై యెండిన దేహముఁ గలిగి చూపఱులకు బరమమూర్ఖుఁడనునూహఁ దట్టఁజేయుచు నాతఁడాగదిలోఁ బ్రవేశించి సోఫాపైఁ గూర్చుండి యచట నున్న వారి యభివందనముల స్వీకరించి యలసిన వానివలెఁ గన్నులుమూసెను. అతికష్టముతో రెండు పర్యాయము లాతఁడు కన్నులఁ దెఱచి నిరర్థకవాక్యములతోఁ గలవ

రించి తిరుగఁ గనులుమూసికొని కనుచుండెను. కెమిలీతనిఁ జూచి యువరాజు బాలిశుఁడని నిర్ణయించుకొనెను.

రైలుస్టేషనునొద్ద యువరాజుజ్వలవేషధారియై గౌరవార్థము నిలువఁబెట్టఁబడిన రక్షకవర్గముప్రక్కనుండి కాలీడుచుకొనుచు, రెండుచేతులను శిరస్సుపైనుంచి సలాముచేయుచు, దనశకటము నధిరోహించెను. యువరాజుచర్య కెమెలుకుఁ గష్టముగఁదోఁచి కంచుకితోఁజెప్పెను. కాని యితర వ్యవహారములతో జోక్యముఁ గలిగించుకొనక నీపనినీవు చూచుకొనుమని యాతఁడు కఠినముగ మందలించెను. కెమెలును సేనాఖండ నాయకత్వమునుండి తప్పించి దళనాయకుఁడుగనియమించుటమేకాక సామానులతో నిండియున్న యొకబండిలో నాతనికిఁ జోటుచూపించిరి. ఈకారణముచే నాతనిమానసము కోపాగ్ని జ్వాలాసంకలితమై ప్రజ్వలించుచుండెనుగాని చేయునదేమియులేక యూరకుండెను. ఆతనిబండిలో నాతనితోఁ గలిసి ప్రయాణము చేయుచున్నవారు క్షుద్రరాజవల్లభులు. వారు తమపై యధికారులకడ నిచ్చకములుచెప్పి తమకంటెఁ దక్కువవారిని దర్జనముచేయ గేహేశూరులు. ప్రసాదరహితమగు ముఖముతోను మూర్ఖతను వెల్లడించు చూపుతోనుగూడి యలసటఁ జెందినవానివలెనుండి రైలుస్టేషనునుండి పోవుచు జేజేశబ్దముచేయు ప్రజల యభినందముల నందుకొనుటఁజూచి కెమెలు తానట్టి యుద్యోగమునఁ బ్రవేశించినందులకు నెంతేని

షిన్నుఁడై యుండెను. తాను టర్కీదేశీయుఁడై యుండుట కెమెలునకు గర్వకారణము. ఇట్టిబాలిశుఁడు టర్కీరాజ్యపుఁ బ్రతినిధిగఁ బాశ్చాత్యప్రభుత్వముల దర్శించుట కెమెలునకుఁ గడు శోచనీయముగా నగపడెను.

టర్కీ రాజ్యప్రాంతమునుదాటగనే యువరాజు తనసమక్షమునకు రమ్మని కెమెలు కడకొకదూతనంపెను. ఆయాజ్ఞానుసారముగఁ గెమెలువచ్చి రాజశకటము నధిరోహించెను. అవలికుఁ గాళ్లీడుచుకొనుచు జరాభారపీడితుఁడై యున్నట్లగపడుటకు మాఱుగ యువరాజత్యంతమును జతురుఁడు విదగ్ధుఁడునై పరిశీలించుచుండుటచూచి కెమెలత్యాశ్చర్య పరవశుఁడయ్యెను.

ఈయువరాజు అబ్దులుహామీదు నాధిపత్యము క్రింద నలువదిసంవత్సరము లాతనిప్రాసాదములో నివసించుచుండెను. రారాజున కీతఁడిష్టుఁడై యాతనిచెప్పు చేఁతలలోనున్నను జారులచే నెల్లపుడుఁ బరిశీలింపఁబడుటచే ననుక్షణము ప్రాణసంశయావస్థలోఁ గాలము వెళ్లఁబుచ్చుచుండెను. ఒక తప్పుగాని యొక రాజ్యలోభచిహ్నముగాని యగపడినను రాజ్యవ్యవహారములలోను బరప్రపంచములోను గొంచెమైన నాశయగపడినను దనకాజన్మకారాగారవాసమో మరణమో తప్పదని తెలిసికొనుటచే నాయువరాజు నిద్రాతురునివలెను బరిశ్రాంతునివలెను జరాపీడితుని విధముననుగపటనాటకమాడెను. స్వత

స్నిగ్ధముగా నతఁడు కుశాగ్రబుద్ధియుఁ దనయభీష్టముల నెన్నఁగ గుర్తెఱిఁగినవాఁడునై యుండెను. సురతానుపదవి నధిష్ఠించుటయే యాతనికిఁ బ్రధానలక్ష్యము. ఎస్వారు, టాలటు లీతని ద్రోసిపుచ్చి యాతనిజ్ఞాతియైన యబ్దులుమజీదును సురతానుగఁ జేయ నిశ్చయించియుండిరి.

కావున వారిపైఁ దనకు మిక్కుటముగ ద్వేషమున్నను వారికిని వారిచారులకును నట్టియనుమానమును గలుగనీక కాను స్టాంటునోపిలులోఁ గెమెలును గపటోపేక్షాభావముతోఁ జూచుచుండెను. ఇప్పు డవకాశము కలుగుటచే నాతఁడు కెమెలును సగౌరవముగ నభినందించి యీవఱకాతని స్నేహలాభమును వడయనందులకు క్షమింపుమని వేఁడి యుద్ధములో నాతఁడు గాంచిన జయమునకై పొగడి చారుభాషణములతో నాతని సంప్రీతునిగావించెను. వారతిత్వరలో స్నేహితులైరి. కెమెలుఁ యువరాజునకు వయస్యుఁడయ్యెను ఎస్వారు టాలటులను వారిరువురును ద్వేషించుచుండిరి. పార్మసీదేశము చేరువఱకును వారిరువురు నతిస్నేహముతో హృదయంగమములగు సంభాషణముల దఱచుగావించుచుండిరి. మహ్మద్దను స్నేహము నియమితకార్య సాధనమున కాధారమని కెమెలు నిశ్చయించెను. అప్పుడున్న సురతాను రోగపీడితుఁడు, జరాక్రాంతుఁడు నగుటచే నచిర కాలములోనే మహ్మద్దు సురతానై సర్వసైన్యాధిపత్యమును వహించునని యాతనియాశ. మహ్మద్దునకు ఉదకమువలె దుర్బల

హృదయుఁడు; కావున నాతని దనవశములో నుంచుకొనిన దన మనోరథము లీడేరునని యూహించెను. ఇందుకు మొట్ట మొదట జర్మనీయులు యుద్ధములో జయముగాంచలేరనియు, వారితోడి స్నేహము ప్రభువుల బుద్ధిమాంద్యమును సూచించు చున్నదనియును వారికిమిత్రులై వారినిలకడకు హేతుభూతు లగు నెన్వరు టాలటుల నధికారమునుండి దొలగించినగాని దేశ మునకుఁ గీడుసంభవింపక తప్పదనియు వహిద్దీనున కతఁడు బోధించుచుండెను.

ఈవిషయములు యువరాజు మనస్సున దృఢముగా నాటుటకై జర్మనీదేశములోని ప్రతివిషయమును కెమెలు పరిశీలనామూలమున ఖండించుచుండెను. ముఖ్య కార్యస్థాన ములో నడువృద్ధుఁడగు ఫీల్డుమార్షల్ వాన్ హిండెన్ బర్గువారిని సత్కరించి గౌరవించి, యిప్పటి యుద్ధరంగము లన్నిటిలోను జర్మనీదేశస్థులే జయశీలురై యున్నారని దెలియపఱచెను. సిరియా యుద్ధరంగములో టర్కీలు దురవస్థలం గురైతిఁగిన వాఁడుగావున కెమెలు వహిద్దీనుతో హిండెన్‌బర్గు వచనములు సత్యములుగావని దృఢముగాఁ జెప్పెను.

అటుతరువాత వారు లూడెన్‌డార్ఫును సందర్శించిరి. అతఁడు నవిస్తరముగా నన్నివిషయములను జెప్పుచు వసంత ఋతువులో దాము గావింపనున్న యువపాతముఁగూర్చి చెప్పు చుండగా హఠాత్తుగా కెమెలు "ఆయువపాతమువల్ల నేమా

తమువఱకు వెళ్లవలయునను నాశతోనున్నారు," అని వానిని బ్రశ్నించెను. ఈయుల్లోద్యోగి సేయుచున్న పరీక్షకుఁ గొంచెము కోపముఁదెచ్చుకొని "మాకు ముఖ్యావసరమయిన స్థలమునకై ప్రయత్నింతుము. ఆటుతరువాత చేయవలయునది యప్పటికుండు పరిస్థితుఁబట్టి నిశ్చయింపఁబడును," అని ప్రత్యుత్తర మిచ్చెను. దానిని వినినపిమ్మట "అదిగో పార్మనీయుల సాంగ్రామిక సామాన్యాధికారిస్థానాధిపతికైనను కావలసినది దెలియకున్నది. దైవయోగముచే వారు ధారగపడియున్నారు. ఇట్టి కొంతమాత్రము సత్యమయిన యాధారము కానేరదు" అని కెమెలు చెప్పెను.

పార్మనీదేశపు చక్రవర్తి వసెండ్రేనుని గౌరవించుటకొకవిందుచేసెను. అందులో కెమెలు "పాంప్లెను" ద్రాక్షాసవమును మిక్కుటముగాఁగ్రోలి మత్తెక్కి యొకచో హిండెన్ బర్గొంటరిగా నుండుటఁజూచి తప్పటడుగులువేయుచు నాయనయొద్దకువెళ్లి "అదిగో మీరు వసెండ్రేను రాక మునుపటితో సిరియా యుద్ధరంగమునుగూర్చి చెప్పినవిషయములన్నియుఁ బూర్ణముగా నసత్యములు. నేనచ్చట నుండినిగాన నాకుయదార్థము తెలియును. మీరుచెప్పిన యాశ్చర్యకరము కాగితముమీఁద నేయున్నది. అదియెట్లున్నను రహస్యముగా మీరు తలపెట్టుచున్న ఘనాపాతముయొక్క లక్ష్యమేమో దెలుపవేమనుచుంటిని"అని యడిగెను. కొంతవఱకుఁ దనగొప్పతనమును దిగించు

కొని యాతని కుత్తరమీయక యెట్టకేలకా సాహసికునిపై దృష్టిని బ్రసరింపఁజేసి యాతనిని నాతనిప్రశ్నములను సరకు గొనక యాతఁడూరకుండునట్లు చేయుటకై యొక సిగరెట్టు నిచ్చెను.

పశ్చిమదిక్కు ననున్న యుద్ధరంగములో నొకభాగమును సందర్శించుటకై ప్రయాణపు లేర్పాట్లు లెస్సగాఁ గావింపఁ బడెను. వహీద్దీనుని పిడిచిపెట్టి జర్మనీయుల సాంగ్రామికోద్యోగులతో గలిసి కెమలు నాశములఁ జొచ్చిపోవు నా స్థానము నకు ముందున్న తరుస్థావలోకనస్థానము నెక్కి తిరిగివచ్చి పైనిజూచుట కెంతో జయశీలురుగా జర్మనీయులగ పడినను వారు మిక్కిలి దురవస్థలో నున్నారని వహీద్దీనుతోఁ జెప్పెను. అవకాశము వచ్చినప్పుడెల్ల వహీద్దీను కైజరును సహితమనను కూలప్రశ్నముల నడుగునట్లుచేసెను. వహీద్దీనాత్మప్రతిపాదకము సేయునటు లొనర్చుటయు నాతని సమక్షములో జర్మనీయు లపజయము గాంతురని నిరూపించుటయు నెన్వరును సమిత్ర కముగాఁ బారదోలుటయు సాహాయ్యకారిగా తన్నే యుంచు కొని రాజు స్వయముగా వ్యవహారములను జూచునట్లుచేయు టయు వాని ముఖ్యోద్దేశములు.

కెమెలు జర్మనీయులపైఁ దనకున్న యనిష్టమును వ్యక్త ముసేయుచుండెను. టర్కీదేశీయుఁడైయుండుటలోఁ దనకున్న గర్వమును స్వదేశముతోను స్వదేశీయులలోను దనకున్నవిశ్వాస

మును బ్రకటించుచుండెను. ఒకనాఁడెవఁడో పార్మనీయుఁ డొకఁడు టర్కులగూర్చి నిరసనభావముతో మాటాడుట విని కోపోజ్జ్వలుఁడయ్యెను. ఒకవిందులో ఆల్సెను మండలాధిపతి యార్మీనియనులను యుక్తముగా పాలింపలేకపోయినందులకు టర్కీ ప్రభుత్వమును ఖండించెను. దానిం బ్రత్యాక్షేపము సేయుమని వహెడ్డీను కెమెలునకు సూచించెను. వెంటనే భావి టర్కీ సురతానుతో మాటాడు విధమది కాదనియు, నార్మీనియనులగూర్చి యామండలపతి కేమియు దెలియదనియును, పార్మనీయులతో మైత్రిజేసి టర్కీ ప్రజలెంతో నష్టపోయిరనియు, నార్మీనియనులు టర్కీ నినశింపజేయుటకు యత్నించుచుండ నొకపార్మసీయ మండలేశుఁడట్లార్మీనియనుల పక్షమవలంబించి తమమిత్రుల నిందించుట పాడిగాదనియు గోపావేశమున బలికెను. ఇట్టి నిష్ఠుర వచనములచేఁ గతుక్కుమని యామండలాధిపతి క్షమాపణ వేఁడెనుగాని కెమెలు ప్రచండకోపముతో “నార్మీనియనుల గూర్చి చర్చించుట కిచ్చటికి మేము రాలేదు. పార్మనీయుల యథార్థస్థితిని దెలిసికొనుటకు వచ్చితిమి. మేము చూచిన దానింబట్టియు పరిస్థులమయితిమి” అని పల్కెను.

వారి పతిభ్రమణమంతమగుచున్నకొలఁది కెమెలు తన యుద్దేశము నతి తీవ్రముగా జెప్పుచుండెను. బెర్లినులో “స్నేలు అడ్లానులో”నున్నపుడు వహెడ్డీను రహస్యముగా దన మనస్సులోనున్న విషయము నరముకలేక దెల్పుటకై వాని సమ్మ

బెరిగిఁ బహుసమీపాకారియై యుప్రమత్తుఁడై సంచరించుచుం
డెను. శక్తిమంతుఁడగు కెమెలుయొక్క వ్యక్తిత్వముం గనిభీతిఁ
జెందెను. ఎవ్వరును సాధించుటకై కెమె లుపయోగించినను
నట్టి ప్రకంపనానివశములోనుండుటకు మాత్రము నిశ్చయించు
కొనలేదు. ప్రసాదజీవనము వహిండ్డనుని దుర్బలునిగా
నొనర్చెను. ఆతఁ డిపుడు క్లీబుఁడై యుండెను.

కొనస్టాంటునోపిలునకుఁ దిరిగివచ్చు ప్రయాణసమయ
ములో ముందు చేయఁబోవు కార్యములంగూర్చి వహిండ్డిను
నకుఁ గెమెలు సూచిపోయుచుండెను. ఆతఁడా విషయములను
గడుశ్రద్ధతోవిని గ్రహించుచుండెను. కొనస్టాంటునోపిలునకుఁ
జేరఁగనె కెమెలు రోగగ్రస్తుఁడయ్యెను సోఫియాలో నంకురిం
చినరోగమునకు మోళ్ళవైద్యము చేయించెనుగాని దానితోనది
కుదురలేదు. అప్పటినుండియు నాతఁ డారోగ్యవిషయములో
శ్రద్ధవహించియుండలేదు.

ఆకారణముచే నది యిప్పుడానికిఁ బెడిఁపదొరకొనెను.
దానికిఁదోడు యుద్ధరంగములలో నెడతెగపిలేక తేఁయుంబవలు
పనిచేయుటయు, నత్యధికమగు మానఃక్లేశమును బడుచుండు
టయు, నొక్కొక సమయములో నధికముగ సురాపానము
చేయుటయు, మితిమీఱి స్త్రీసంభోగము కావించుటయు హేతు
వులుగా నాతని మూత్రకోశములు వ్యాధిగ్రస్తములైనవి. ఒక్క
నెలదినము లాతఁడు తీవ్రవేదనకుఁ బాల్పడి మంచము మీఁది

"నీ యభిప్రాయములతో నేకీభవించు నితరోద్యోగు లెవ్వరైనఁ గలరా" అని వహీద్దీ నడుగ "రాజకంఠీరవా! పెక్కురున్నారు" అని కెమెలు ప్రత్యుత్తర మిచ్చెను. అది విని వహీద్దీను మాత్ర మెట్టి సమయమును జేయలేదు. రెండు మూఁడు పర్యాయములు కెమెలు సురతానును సందర్శించితన యుద్దేశమును నొక్కి చెప్పుచుండెను. వహీద్దీను సురతానును బ్రోత్సహింపఁగలిగిన యెడల నెన్వరును వాని యనుయాయులను దఱిమి వేసి మనోరథసిద్ధి నందఁగలనని యాతఁడనుకొనుచుండెను. కెమెలు పాషా వహీద్దీనుతో మాటాడుచు నత్యంతము నుత్సాహపూరితుఁడై సురతాను మాటను జారనీక సల్లపించుచుండుఁ గోపావేశముతో నాతఁడు "గౌరవనీయులగు నెన్వరు టాలటుపాషాలతో నేనన్ని యేర్పాటులను గావించితిని" అని కఠినముగఁ బల్కెను. ఎన్వరు సురతాను బెదరించెను. భావములఁదియగు దామదుఫెరీదుపాషాతో నాతఁ డాలోచించి, యెన్వరుతోడను నైకమత్య సంవర్ధక సంఘముతోడను బోరాడుటకుఁ దనకు శక్తి చాలదనియు, ముస్తఫా తనకు సాయముచేయఁగలిగినంత బలగముతో లేఁడనియుఁ దెలిసికొని కెమెలును సురతాను నిరాకరించెను. ముస్తఫా యాగ్రహావేశపరవశుఁడై యెన్వరుచే నాతఁడు పరాజితుఁడై నాఁడని నిశ్చయించి, తన సంకల్పములను గొనసాగించుట కది సమయము కాదని యూహించి యూరకుండెను.

ఎన్వరు కెమెలును గొనస్టాంటునోపిలునుండి పంపివేయుటకు నిశ్చయించెను. సైసన్నివేశము సంభవించిన రెండు

వారములలో శుక్రవారమునాటి సెలామికు దేవకార్యము పూర్తి కాగానే సురతాను గెమెలును రప్పించి పార్శనీయ సేనానులు తదితరులు చుట్టుముట్టియుండ "ఈయన ముస్తఫా కెమెలుపాషా, నిపుణుఁడగు సాంగ్రామికోద్యోగి: ఇతనియందు నాకు సంపూర్ణమైన నమ్మకమున్నది," అని పార్శనీయ సేనానులతోఁ జెప్పి కెమెలువైపుతిరిగి "గౌరవనీయా! మిమ్ము సిరియాదేశములో నొక సైన్యాధికారిగ నియమించితిని. ఆ యుద్ధరంగము మన కతిముఖ్యమైనది. మన శ్రేయస్సాయుద్ధంపుఫలితముపై నాధారపడి యున్నది. మీరవిలంబముగ నటకేగి దేశము శత్రువశముకాకుండఁ జేయవలయునని చెప్పుచున్నాను. నా యాజ్ఞలను నెఱవేర్చి కీర్తిఁ గాంచెదరని నా నిశ్చయము" అని చెప్పుచు నాతనికి సెలవిచ్చి పంపివేసెను. కెమెలటనుండి బయలుదేరిపోవుచు దారిలోనున్న కోష్ఠములో నెన్వరును గలిసికొని "మాయాతే! ఎన్వరు మహాశయా! మిమ్మభినందింపవలసి యున్నది. నాకుఁ దెలిసినదానిం బట్టి సిరియాలోనున్నదని చెప్పఁబడు సైన్యము కాగితముమీఁదనే యున్నదని చెప్పవలసియున్నది నన్నటకుఁ బంపి ప్రశంసనీయమగు ప్రతీకారమును నాకుఁ గావించితివి" అని చెప్పెను.

ఇట్లు వారిరువు ప్రతిపక్షులును గలిసికొని యొకరినొకరు చూచుకొనుచుండిరి. అల్పదేహుఁడు; సువిశాల ఫాలయుక్తుఁడు; ధైర్యశాలి; ప్రసన్నచిత్తుఁడు; బాలముఖుఁడు;

గౌరవ చిహ్నాచ్ఛాదితుఁడునై యుండెనెన్వరు. ముస్తఫా వాని కంటెఁ బాపవరి; ధూసవరర్ణుఁడు; ప్రతిబద్ధనీలముఖుఁడు; రాత్రుభూమిలతాచ్ఛాదితకోపపూరితనయనుఁడునై యుండె నాతఁడు. ఆ సమయమున నొకమూలనున్న జార్మనీయు సేనానియొకఁడు "టర్కీల సైన్యములకుఁ జేయవలసినదేమియులేదు. యుద్ధమున బలాయనమంత్రము పఠించుటతప్ప వేఱేమియు నెఱుఁగనిపశు తుల్యులువారు. వారిపైని సాంగ్రామికాధికారము వహించు వానిని గని నేనసూయపడను" అనిబిగ్గరగఁ బలికెను. కెమెలు కోపోద్రిక్తమానసుఁడై యాసేనానిపై రూక్షేక్షణములఁ బఱపుచు "నేనుగూడ సైనికుండను. ఈసేనలకు నియంతనై యుంటిని. టర్కీ దేశపు సైనికుఁడెన్నఁడును యుద్ధమునుండి పారిపోఁడు. పలాయనార్థము నిప్పపదమే యాతనికిఁ దెలియదు.

ఓ జార్మనీయు సేనానీ! నీవు టర్కీ సైనికుల పృష్ఠము చూచి భయపడి పరుగెత్తుచు నట్లూహించియుందువు. ఇట్టి పిరికివాఁడవగు నీవు టర్కీ సైనికులనిందింప నెట్లు సాహసించెదవు" అని గంభీరోక్తుల నుత్కంఠతోఁ బలుకుచుఁ గోష్ఠము నుండి వెడలిపోయెను.

ఫాల్కెనుహేను 1918 సంవత్సరము వసంతమాసమున జార్మనీదేశమునకు వెళ్లెను. వాన్ సాండర్సు సిరియాను యుద్ధరంగములోనున్న సేనల కధిపతియయ్యెను. కెమెలు ఆగష్టు మాసాంతమునకు సిరియాదేశముచేరి తనరాకనువాన్ సాండర్సు

నకు నివేదించెను. అతనిరాక కతిసంతుష్టహృదయుఁడై యుద్ధ రంగమునెల్లఁ దిరుగుచుఁ బరీక్షించెను. వాన్‌సాండర్సునకు ముఖ్యకార్యస్థానము నాజరెతు. పశ్చిమమునుండి యుత్తరము నకు నాళములు(దగ్గ)ఫ్ఫా యందుండి నాళయుద్ధము చేయుటకు సైనికులు సంసిద్ధులైయుండిరి. ఈనాళములు జాఫాయను నోడ రేవునకుఁ బదిమైళ్ళుత్తరమునఁ బ్రారంభించి సముద్రప్రాంత మధ్యతలమునుండిజూడియాపర్వతములయొక్క యుజోర్డనుసదియు మీఁదుగ హెడ్జాజు రైలుమార్గమును "మాను" నెడారివఱకుఁ బ్రాకియుండెను. దక్షిణమునుండి యుత్తరమునకు సిరియాకుఁ బోవుమార్గములనన్నిటి నావేష్టించియుండెను. హెడ్జాజు రైలు మార్గము "మాను" మరుభూమిలో నుండిపోయి డెరా-అ యను రైలుమార్గముల సంధిద్వారమున డెమస్కసునకుఁబోవుచుండును. దీనికన్నఁ బెద్దదగు మఱియొక రైలుమార్గము రయాకునుండి బయలుదేరి యలెప్పోమార్గముగా టర్కీదేశమునకుఁ బోవు చుండెను. ఏఁడవ సేనాదళమున కధిపతి ఫెవ్జిసేనానాయకుఁడు. అతఁడు కాన్‌స్టాంటునోపిలులో సామాన్య సాంగ్రామికాధి కారవర్గమున ముఖ్యుఁడయ్యెను. కెమెలుకూడ దీనికే నాయ కుఁడుగ నియోగింపఁబడెను. ఈసేన టర్కుల నాళమధ్యము లను రక్షించుచుండెను. ఆసేనలోని రెండుదళములు నాళము లలోనుండెను. ఆదళములకు నాయకులు కర్నలు ఇస్మెటు, కర్నలు అలీఫాదుననువారు. వీరికిఁ గుడిప్రక్క నెనిమిదవసేన

యుండెను. కర్నలు రెఫేటు నాయకత్వముక్రింద రెండవ సేనా దళము సముద్రతీరము వఱకును నాళముల రక్షించుచుండెను. చిన్న రైలుమార్గమొకటి డెరా-ఆ రైలుమార్గపు సంధినుండి పశ్చిమమునకేఁ డెనిమిది సేనల పృష్ఠభాగము వఱకును బోవు చుండెను. ఈతోవను సేనల కాహారాదిపదార్థములు పంపఁ బడుచుండెను. ఎడమవైపున నాల్గవసేన హెడ్జాజు రైలుమార్గ మును రక్షించుచుండెను.

ఈసైనికుల యవస్థ కాకసుప్రాంతములోనున్న సైని కుల యవస్థకన్నఁ గడుహీనమై యుండెను. ఆసైనికుల దైన్య ము చెప్పనలవికాదు. పెద్ద సైనిక దళములలో, వానిలోనుండ వలసిన సైనికులసంఖ్యలలోను పదవవంతుమాత్రమే యుండెను. ఆయున్నవారును బలుసారులధికారులచే నిరసింపఁ బడుచుఁ దినఁదిండియుఁ గట్టుగుడ్డయుఁ ద్రావుటకు నీరును లేక బాధపడు చుఁ బుఱ్ఱవులుగారుచు మరుభూమిలోఁ దీక్ష్ణభాను ప్రచండకిర ణములచే సంతప్తులగుచు జ్వరాతిసారాదులచే మరణించు చుండిరి. వారిశీలము నశించెను. వారినధికారులు బలాత్కార ముగ నాళములలోఁ బట్టియుంచుచుండిరి. సేనానివేశమును వదలినవారి నగపడినతోడనే తుపాకులతోఁ గాల్చి చంపు నధి కారముతో సైనికుల ననవరతము లారీలలో సైన్యము వెనుక భాగమునఁ దిరుగుచున్నను సైన్యములలో నున్న వారి సంఖ్య కన్న వెడలిపోవువారి సంఖ్యయే యధికమగుచుండెను.

# షష్టమ ప్రకరణము

మెక్కా రాజైన హుసేనుకుమారుఁడగు నమీరుఫీజులు యొక్క యారబుప్రజ లాంగ్లేయులతోఁ గూడిరి. టి. ఇ. లారె న్సను నాంగ్లేయుని నాయకత్వముక్రింద వారెడారిమూలముగా టర్కులపైఁబడి రైలుమార్గముఁను, టెలిగ్రాము టెలిఫోను తీగెలను దెగఁగొట్టుచు, వంతెనలను బద్దలుగుఱిచేసి తిరుగఁ ద్రోయుచు, మార్గరక్షకుల బందీలఁగావించుచు, మార్గావ రోధభయము నొదవించుచు, సైనికులలోఁ బరస్పరము భీతి నొదవించుచు, దేశవాసులచే రాజ్యపరివర్తన కార్యములం జేయించుచు, టర్కుల నష్టకష్టములకుఁ బాల్పడఁజేయుచుండిరి. మరుభూమివైపునుండి యేసమయమునఁ దమకుపద్రవము సంభ వించునోయను భయము టర్కుల మనముల వేధించుచుండ నాళముల కెదుట నాంగ్లేయసైన్యములొక ఘోరావపాతమునకై సన్నాహము కావించుచున్నట్లు వ్యక్తమగుచుండెను. ఆంగ్లేయ సైనికులసంఖ్య యత్యధికముగనుండెను. వారుత్సాహపూరి తులు, నశ్రాంతులు, శక్తియుక్తులునై యుండిరి. వారి విన్యాస ములు, చికిత్ససేయు సేవకగణములు, సంభారసంయోజక సేవక గణములు సునిర్మితములై యుండెను. సంభారయుద్ధోపకరణ ప్రహరణ యంత్రవిమానాదులు వారికిఁ గొదువలేకుండెను. టర్కుల కెనిమిదివిమానములు, రెండువవిమాన విచ్ఛేదకశత ఘ్నులు మాత్రముండెను.

కెమెలు టర్కీసేనల దురవస్థంగని నిరాశఁ జెందక యెప్పటివలె సైన్యముల పునర్నిర్మాణమున కారంభించెను.

అతితీవ్రముగఁ బునర్నిర్మాణ కార్యక్రమమును నడిపించుచు నైకమత్యాభావమును బోఁగొట్టుట కపూర్వ ప్రయత్నముల సలుపుచుండెను. కాని యంతలో నాతనికి వ్యక్తిరుగ్మతసంభవించెను. ఆతని ముఖ్యకార్యస్థానముగు "నబ్లుసు"లో సెప్టెంబరుమాసమున, శత్రుసైన్యము లెప్పుడు మీఁదఁబడునోయని టర్కీసైనికులు భయవిహ్వలులై యుండ నీతఁడు రోగపీడితుఁడై మంచమెక్కెను. సేనాత్యాగియగు నొక యిండియనుసార్జెంటు సెప్టెంబరు పదునేడవ తేదీనాఁడిరువది రెండవ సేనయున్న స్థానమును జేరి సముద్రప్రాంతములోఁ బందొమ్మిదవ తేదీని ఘనావపాతము జరుగునని తెలియఁజేసెను. రెఫెటీయుదంతమును గెమెలుతోఁ జెప్పెను. కెమెలును నిస్మెటునాలీఫాదులను రావించి వారితో నాలోచించెను. వారాయుదంతము సరియైన దేయని నిర్ణయించి లిమనువాన్ సాండర్సున కాయుదంతమును దెలియఁజేసిరి. ఆసేనాని యాయుదంతము సరియైనది కాదనియు నాతఁడు టర్కీలను దగాచేయుటకుఁ బంపఁబడిన బూటకపు సేనాని త్యాగియనియు, నాంగ్లేయావపాతము తూర్పున రైలుమార్గమునైపు సంభవించుననియు నమ్మి తన సేనలోఁ బ్రశస్తమైనవాని నావైపుకంపెను. కెమెలుమాత్ర మాయుదంతమును యథార్థముగ నమ్మి తాను జ్వరమువల్ల నత్యధిక క్లేశమును బడుచున్నను నతికష్టముతో మంచముమీఁదినుండి ప్రాకిపోయి మనోబలము నాతనశక్తినిగలుగఁజేయ నవకాశమున్నంతవఱకు యుక్తమైన యేర్పాటులఁ గావించి, సేనానాయకులను జాగరూకతతో

నుండుఁడని హెచ్చరించుచు నాంగ్లేయుల దాడికొఱకు వేచియుండెను. పందొమ్మిదవ తేదీనాటి యర్ధరాత్రమున వీరిపై శత్రువులు శతఘ్నీముక్త గోళికావర్షమును గురిపింప నారంభించిరని టెలిఫోను మూలముగాఁ దెలియవచ్చెను. ఉదయముననే యాంగ్లేయావపాతము ప్రారంభమయ్యెను. ఏఁడవసేన నెదుర్కొని తీవ్రయుద్ధము గావించుచు వారెనిమిదవసేనపైఁ దమ శక్తినంతను వినియోగించుచుండిరి. టర్కీలసేనల కుక్షిభాగమును విదళించుకొనిపోయి సముద్రతీరము ననుసరించి యిరువదిరెండవ సైనికదళమును నెనిమిదవసేననుగూడ నిర్మూలము కావించి, పార్శ్వభాగమునుండి టర్కీలనుమరలించి వారిసేనల పృష్ఠభాగము నాక్రమించి యుత్తరమునకు టర్కీలుపోకుండఁ జేసిరి. వాన్‌సాండర్సు నతికష్టముతోఁ దప్పించుకొని పాఱిపోయెను.

అట్టిసమయమునఁ గెమెలు జోర్డనునదిని వెనుకకుంచుకొని, తనసైన్యమును ద్రిప్పకొని ఘోరసంగ్రామముఁ గావించుచు వెనుకంజవేయ నారంభించెనుగాని వాని సైనికులుమాత్రమాంగ్లేయుల దాడికాగలేక చెల్లాచెదరై పారిపోవ నారంభించిరి. కూడదీయఁ గలిగినంతమంది సైనికులను దన నాయకత్వముక్రిందఁ గూడఁదీసికొని నైదవనాఁడు జోర్డనునదిని దాట నారంభించెను. సవిస్తరముగానున్న విషయములను దానేచూచుకొనుచుఁ దనసైనికులలో నధికభాగము దాటినవెనుకఁ దాను దాటివచ్చెను. కెమెలు జోర్డనునదిని దాటినకొలఁది నిమిషము

లలోనే పదునొకండవ యాశ్వికదళ మచ్చటకుఁజేరి మిగిలిన సైన్యమును దాటకుండ నిరోధించిపట్టకొనెను. టర్కులయొక్క నాల్గవ సైనికదళము శైలుమార్గమున ననుసరించియే పాఱిపోవు చుండెను. ఈతఁడు తనసైన్యముతో నెడారిమీఁదుగ డేరా-ఆశైలుమార్గముయొక్క సంధికై ప్రయాణము సాగించుచుం డెను. ఆతనివెంటఁదఱుముచు నాంగ్లేయుల సైన్యము లిరు పార్శ్వములఁ బోవుచుం బాధించుచుండెను. వెనుకనుండి యుద్ధముచే సైనికదళములు సంకటమార్గములోఁ జిక్కువసి యాంగ్లేయుల యంత్రచోదిత శతఘ్నులచే నశించినవి. ఆకా శమున విమానములు సైన్యముల కనతిదూరమున నెగురుచు, బాంబులనువైచి యంత్రచోదిత శతఘ్నిగోళికా వర్షముచే నాశముకావించుచుండెను. ఎటుచూచిన నత్యంతభయవిహ్వలు లగు సైనికులే; ఏప్రక్కఁదిలకించిన నాత్మసంరక్షణము గోరు వీరులే; ఏదిక్కు నవలోకించినను ఫిరంగులు, యుద్ధోపకరణ ములు, తుపాకులు, పశువులు, బండ్లు, తదితర సామానులు, మున్నగువానిని బరిత్యజించి పలాయనమొనరించు సైనికసమూ హములే; వారిప్రక్కను లారెన్సు నరబ్బిసహకారులు వెనుకఁ బడినవారిని జంపుచు దోచుకొనుచు నతిహీనములగు నరబ్బి విధానములతోఁ జిత్రవధలఁగావించుచు టర్కులను భీభత్సము కావించుచుండిరి. ఇట్టి యనిర్వచనీయమగు కష్టసమయము లోఁగూడఁ గెమెలు తన శక్తిసామర్థ్యములచే నధైర్యముఁజెంద నీక పాఱిపోవుచు, డేరా-ఆచేరియుచట నాగకడెమస్కసున కతి

రయమునఁ బలాయనమయ్యెను. ఆంగ్లేయు లాతని బట్టుకొనలేకపోయిరి. డెమస్కసకుఁ జేరఁగనే వాన్ సాండర్సాతని రయాకునొద్ద నూతనయుద్ధరంగము నేర్పఱుపుమని కోరెను. డెమస్కసులో నిస్మేటును విడిచిపెట్టి యాలీఫాకును దీసికొని యుద్ధసన్నాహమును జేయనారంభించెను. కాని సముద్ర తీరప్రాంత పట్టణముల ప్రజలు శత్రువులతో నేకమగుటచేతను, బెరూతులో నాంగ్లేయులు ప్రవేశించుటచేతను, రయాకులో నెట్టియుద్ధరంగము నేర్పఱుప యత్నించినను నాంగ్లేయపార్శ్వపాతమునకు లోనుగావలసియుండునని నిశ్చయమయ్యెను.

ముస్తఫా కెమేలుపాషా పరిస్థితులను సతిత్వరితముగఁ బరికించి చూచి టర్కీసైనికుల ప్రతిఘటనకార్యము సంపూర్ణమైనదని గుర్తెఱింగెను. సైనికాధికారులుగూడఁ దమ యుద్యోగములను వదలి యాత్మరక్షణమునకై పారిపోవుచుండిరి. సైనిక విప్లవము నాతఁ డరికట్టలేకపోయెను. నాలుగవ సైనిక దళమునకుఁ జెందిన యొకనాయకుని బారిపోవుచుండ నడ్డి "నిన్నుఁ దుపాకితో గాల్చుట యుక్తము; అయినను నీకింకొక యవకాశము నిచ్చుచున్నాఁడను. రయాకులోనున్న యాలీఫాదునొద్దకుఁబోయి పనిచేసి నీవు చేసిన దోషమును బాపుకొనుము" అని యాజ్ఞాపించెను. ఆ సేనానాయకుఁడు సలామునుబెట్టి మరునాటి యుదయమునఁ బయనమైపోయెను. సేనానాయకులలో నిట్టి శీలభ్రంశము సంభవించినపుడు సామాన్యసైనికులను శిక్షించుటలాభములేనిపనియని గుర్తెఱింగి యాంగ్లేయు లింకనుఁ

గొంతదూరములోనుండుటచే రెండువందలమైళ్ళు వెనుకగానున్న యలెప్పోకుఁ బారిపోయి సిరియా దేశమును శతృవుల చేతుల లోఁబెట్టి, సైన్యమును బునర్నిర్మాణము గావించుకొని, టర్కీదేశములోనికిఁ బోవు మార్గములనన్నిటిని నిరోధించుటకై యుత్తరమున నొకస్థాన మేర్పఱచుటకు నిశ్చయించుకొని వాన్ సాండర్సునకుఁ దెలియఁజేసెను.

సాండర్సు:- నీ యుద్దేశము సరియైనదే; కాని నేనట్టి యాజ్ఞనీయఁజాలను. నేను బరదేశీయుఁడను. ఎట్టి యుద్ధమును జేయకుండ నొట్టమను సామ్రాజ్యములో నొక భాగమును శతృవుకొప్పఁ జెప్పఁజాలను. దేశనాథులగు మీ టర్కులే యది నిర్ణయించుకొనవలయును.

ముస్తఫా:- "ఏనాథులకైనను, నేను సంపూర్ణ బాధ్యతను వహించి జబాబ్దారీయగుదును" అని చెప్పుచు శతృవులతో సంపర్కమునుఁబరిత్యజించి యలెప్పోకుఁ బాఱిపోవుటకు సైనికుల కుత్తరువు లిచ్చెను. సేనలకంటె ముందుగాఁ దాను పోయి యలెప్పో కుత్తరముగాఁ బదిమైళ్ళదూరమున నొకస్థాన మేర్పఱచెను. టర్కీలోనికి టారసుపర్వత శ్రేణిలోనున్న యొక సంకటవివరములోనుండిపోవునొక మార్గము నరికట్టెను. సైనిక దళములు సురక్షితములయ్యెను. సేనానివేశపరిత్యాగులుగాని శతృవులుగాని తెలియకుండ నటు పోఁజాలరు.

అరేబియా, పేలస్టీను, సిరియాయను నివి యరబ్బుల దేశములు. వానిని జయించి టర్కులు పరిపాలించుచుండిరి.

# షష్ఠమ ప్రకరణము

ఇప్పుడు టర్కీ దేశము వానిని బోఁగొట్టుకొనెను. ఈ నూతన స్థలములో టర్కీ-దేశములోనికి శత్రువులు ప్రవేశింపకుండ నుండుటకు జీవితనిరపేక్షకులైన టర్కులచేఁ బోరాడించుటకు నిశ్చయింపఁబడెను. తన కంఠములోఁ బ్రాణమున్నంతవఱకు యుద్ధము నడిపించుటకుఁ గెమెలు కృతనిశ్చయుఁ డయ్యెను. విఱువడిన సైనికులు వచ్చిన, దిరిగివారిని దళములోఁ జేర్చి వారి నుత్సాహపూరితుల గావించుచు వారి వారి స్థానములవారి కొసఁగుచుండెను. ఇట్లలజడిపడుచునే కెమెలు నెస్వరును నాతని మిత్రులను దేశ బహిష్కృతులఁ గావించి తన్ను సాంగ్రామిక మంత్రిగ నొనర్పుమని సురతానునకుఁ దంతి వార్త నంపెను; కాని దానికెట్టి ప్రత్యుత్తరమును రాలేదు. ఎన్వరు, టాలటు, జెమలు నల్లసముద్రములోనుండి పలాయనము కావించిరనియుఁ గెప్తాను కేపు, జెనరలు ఫెజ్జి, నుంత్రివర్గమునఁ జేర నూతన ప్రభుత్వ మేర్పడినదనియు మాత్రము వార్త కెమెలునకుఁ దెలిసెను.

టర్కీ-ప్రభుత్వము సంధిచేసికొనుస ట్లేర్పాటు చేయుమని లారెన్సరబ్బీయులచేతఁ గెమెలునకు రాయబార మంపెను. కాని యాతఁ డందుల కియ్యకొనలేదు. "తర్జనములను విసిగి నే సంధిచేసికొనుటకు నేను పిఱికిపందనుగాను, యుద్ధమును సాగించెదను" అని కెమెలు ప్రత్యుత్తరమంపి తనస్థానము దుర్జేయముగుటకు సర్వప్రయత్నములను గావించెను.

మొదట వతెపోప్పుర వాసు లూరకుండిరి. ఆంగ్లేయసైన్యములు సమీపించినకొలది శత్రుభావము నగపఱచుచు నల్లర చేయఁ బ్రారంభించిరి. కెమెలు పట్టణమధ్యమున "హూటెలు బారనులో" వాసమేర్పఱచుకొనెను. ఒకసారి కార్యస్థానము నుండి మోటారుబండిలో సారధిద్వితీయుఁడై కెమెలు వాసస్థానమున కేగుచుండ గ్రామసింహములవలెఁ గర్కశారావములఁ గావించుచుఁ బౌరులగుంపాతని ముట్టడించెను. అపుడాతఁడు చేబుకుతో వారలఁ దఱిమి హూటెలునకుఁ బోయెను. అచటికిఁ గూడ నాగుంపు రాఁగ వారికి సంతుష్టిఁగరగించి పంపివేసెను. మఱునాటి యుదయమునఁ బెద్ద కలకలధ్వని విని వరండాలోనికిఁబోయి చూడఁ గ్రిందవీధులలో భయసంజననమైనట్లు తెలిసికొనెను. తూరుపుమరుభూమినుండి యరబ్బులు దండెత్తివచ్చి పట్టణమునఁ బ్రవేశించిరి. అది తెలిసి కెమెలు కాలవిలంబము చేయకుండఁ బట్టణమును విడిచి కిట్మాలోఁ గార్యస్థానము నేర్పఱచుకొని యాంగ్లేయూవపాతము నెదుర్కొనుటకుఁ గాచుకొని యుండెను.

అక్టోబరిరువదియూఱవ తేదీ నాంగ్లేయపురోగామి సైన్యదళములు సంధినిగోరుచు టర్కులున్న స్థలమున కెదుటఁ జేరెను. జోడుపూరు మైసూరులాన్సరుల యాశ్వికదళములు "హారతాను" గ్రామము మీఁదఁబడినవి ముస్తఫా స్వయముగ నాగ్రామమునకుఁబోయి శత్రువులపై ఫిరంగులఁ గాల్పించెను. భారతీయులలోఁ బలువురు మరణించుటచే సాయముకొఱకు

**వేడుచు** నార్తదీనాలాపములతో వెనకకుఁబోయిరి. **ముస్తఫా యచటి** కుత్తరమునఁ బదిమైళ్ల దూరములోనున్న సురక్షిత స్థానమునకుఁబోయెను. ఉభయపక్షములవారును యుద్ధము చేయుటకును సంసిద్ధముగనుండ నాంగ్లేయులతో టర్కీప్రభుత్వము సంధిగావించుకొనుటకు సిద్ధముగానున్నదని కాన్‌స్టాంటునోపిలునుండి వార్త వచ్చెను.

జర్మనీయులందఱును దమజన్మభూమికి వెడలిపోవలెనని హుకుమువచ్చెను అంతఁ గెమెలు 'అదనా' అను పట్టణములోని పథికాశ్రమమున దక్షిణటర్కీలోనున్న సేనల సర్వాధిపత్యమును లిమనువాన్‌సాండర్సునుండి తీసికొనెను. వారిరువురును నొక మేజాబల్లకిరుప్రక్కలను గూరుచుండి యధికారకార్యపరిగ్రహణము ముగిసినపిదప నట్టి సంపూర్ణాపజయ **సమయ**మున నేమిచెప్పుటకును దోఁచక యా ధైర్యశాలురు, పోరాటములో నారితేరినదొరలు, రణచుంచువులు, గర్విష్ఠులు కుశాగ్రబుద్ధియుక్తులు నగువారు తమ కొండొరులపైనున్న యధికారగౌరవమును సూచించుకొనలేక యూరక యుండిరి. తుదకు లిమనువాన్‌సాండర్సిట్లనెను: "గౌరవార్హా! అనఫార్టా యుద్ధరంగములో సైన్యాధిపత్యమును వహించిన నాటినుండియు మీపరిచయము నాకుఁగలిగినది. తొలుతనే మీయద్భుతశక్తిని గ్రహించితిని గర్వము నాకుఁగలదు. మనకుఁదఱచుగ నభిప్రాయభేదము కలిగినను స్నేహముతోడనే మెలఁగితిమి. నాసైన్యాధిపత్యమును దమవంటి నిపుణులచేతిలోఁ బెట్టు

చున్నాను. అదియే నాకు సమూశ్వాసజనకమగు విషయము" అని పల్కుచు కెమెలుకడ సెలవుగైకొనెను.

టర్కీదేశముకు జయముం గాంచినను యుద్ధరంగములో సర్వసేనాధిపత్యము తానేవహించి కెమెలు శత్రువులకు వశపడక, సంధిసమయములు కార్యరూపములుదాల్చు విషయములో విజేతలతో వివదించుచుం గార్యకరణమును బోధుగించుచుండెను. ఆంగ్లేయులు అలగ్జాండ్రెట్టా పట్టణము నాక్రమింప నుద్యుక్తులై యుండ వారికెట్లు చేయుట కధకారము లేదనిచెప్పియుచటను వైనికులతో నాయూ క్రామికుల నిరోధింపనాజ్ఞాపించిదాడి వెడలెదనని వారిని బెదరించెను. ప్రధానమంత్రియు ఓ నిజెట్టు తోలిసంధిసమయముల ననుసరింపుమని యాజ్ఞాపింప నాయాజ్ఞల నతఁడు నిరాకరించెను. పిమ్మట నిజెట్టు తనదే శొరపాటని కెమెలును బ్రతిమాలెను. అపుడు కెమెలు "మనము వారిపాదములపైఁ బడకూడదు. అట్లుచేసిన మనకు సర్వనాశము సంభవించును" అని వానికిఁ బ్రత్యుత్తరమిచ్చెను.

కెమెలు యుద్ధప్రదేశముల బంధించుచు యుద్ధపరికరములతోడను స భారములతోడను గూడిన సైనికులఁ బోర్వు చేయుఁడని కొండలలోని సామ్రాజ్యాధికారులకుఁ గబురంపెను. ఇట్టివారికాయుధములనిచ్చి యుశ్ర్ంఖలదళములఁ దయారుచేసి "గొరిల్లా" యుద్ధము నడిపించినయెడల శత్రువులను టర్కీలోఁ బ్రవేశింపకుండ నిరోధించుటకు నిర్ణయించుకొనెను.

## షష్ఠమ ప్రకరణము

కాన్‌స్టాంటినోపిలులో ఫెరీ, కప్తానుకౌఫ్, జనరల్ ఫెవ్జి మున్నగువారు మంత్రివర్గములోఁ జేరి నూతనప్రభుత్వ మేర్పఱిచెను. ఇస్మెటు ఉపసాంగ్రామికమంత్రిగ నియమింపఁబడెను. ముస్తఫాకు మాత్రమెట్టి యధికారస్థానము నొసంగఁబడ లేదు. ప్రచండకోపియగుటచే సురతానునకును దనకును వివాదము ఆసన్నమైనదనియుఁ దాను దనపదవికి రాజీనామానిచ్చుటకు సిద్ధముగ నుంటిననియు, నాంగ్లేయుల స్నేహితుఁడైన ట్యూఫిక్ పాషా ముఖ్యనియోగిగ ననియు, ముస్తఫా సాహాయ్యము తనకవసరమున్నదనియు, తత్క్షణమే బయలుదేరి రావలయుననియుఁ బ్రధానమంత్రి కెమెలునకు టెలిఫోనుమూలముగా వార్తనంపెను. ముస్తఫా దాని ననుసరించి కాన్‌స్టాంటినోపిలునకుఁ బ్రయాణమయ్యెను.



